Reg No M 757.

శ్రీ

# అభినవసరస్వతి.

యనునొక మాసపత్రిక.

అష్టావధాని, జానపాటి పట్టాభిరామశాస్త్రిచేఁ

ప్రచురింపఁబడుచున్నది.

గుంటూరుజిల్లా, పల్నాఁడుతాలూకా, జానపాడు.

సంపు 3.] 1911సం॥ నవంబరు. [సంచిక 11

విషయములు.



చందానిర్ణయము సంవత్సరమునకు.

| | | | |
|---|---|---|---|
| ప్రధానపోషకులకు | రు 25-0-0 | —సహాయులకు | రు 5-0-0 |
| పోషకులకు | రు 10-0-0 | —చందాదారులకు | రు 2-0 0 |

భారతీవిలాస ముద్రాక్షరశాల, నర్సారావుపేట.

Printed at the Bharathi Vilasa Press,
Narasarowpet And published at Janapadu,
by the Editor Astavadhani
Janapati Pattabhirama Sastry.
1911

ఈసంవత్సరము చందాయిచ్చిన—

## స హా యు లు

1 సూరిదేవర సుబ్బానాయుడుగారు తుమ్మపూడి.
2 తంగెడనరసింహారావుగారు. కరణం, మోర్జంపాడు
3 పిరాట్ల సీతాకాంతంగారు; చింతపల్లి.
4 పిరాట్ల సత్యనారాయణగారు, చింతపల్లి.
5 కొప్పరాజుగురుచంద్రశేఖరరావుగారు, ఫారెస్టుగార్డు, మేళ్ళవాగు.
6 రామసింగుగారు' నెల్లుట్ల.
7 ఏలేశ్వరం వెంకటసుబ్బారావుగారు, వకీలు, సిద్దిపేట.
8 కంచర్లలక్ష్మయ్యగారు, ఫారెస్టుగార్డుపాపయ్యపాలెం.
9 వెలుగూరిపిచ్చయ్యగారు' పెదకొదమగుండ్ల.
10 గోరంట్ల పున్నయ్యగారు' వుప్పలపాడు
11 వుప్పలపాటి వెంకటసుబ్బయ్యగారు, కరణం వుప్పలపాడు.
12 కాకుమాను హనుమయ్యగారు, నర్సారావుపేట.
13 సైదుఖాసింసాహెబుగారు, ఫారెస్టుగార్డు, చింతపల్లి.
14 రాజశేఖరునిలక్ష్మీనారాయణగారు, కరణం, చిట్యాల
15 ముప్పాళ్లవైశ్యులు, ముప్పాళ్ళ.
16 ఘడియారం వెంకటశివశాస్త్రిగారు, సంగంజాగర్లమూడి.

ఇవ్వవలసినవారు—

17 బూదరాజు వెంకటసుబ్బయ్యగారు, కరణం, స్వర్ణ.
18 తుమురుగోటి నరసింహారావుగారు, తిరుమలగిరి.
19 కలవలపల్లిరంగయ్యశాస్త్రిగారు, భాష్యాచార్యులు, ఏలూరు
20 మంచిళ్ళ నారాయణరావుగారు, కంభంపాడు.
21 మెదకు శేషారావుదేశముఖుగారు, నల్లబల్లి. పాలెం.
22 కర్లపాలెం నరసింహంగారు, ఫారెస్టుసూపరువైజరు, పాపయ్య
23 కుప్పా శంకరశాస్త్రిగారు, చివలూరు.

శ్రీమత్.

# అభినవ సరస్వతి.

ఇది మాసమున కొకసారి ప్రచురింపఁబడును.

సంపు 3. { విరోధికృ॥ మార్గశిరమాసము. { సంచిక ౧౧

—:—

## కొప్పరపు సోదరుల శతావధానము.

ఈశతావధానుల నవధాన విధానంబు వసుధఁ బ్రథితంబయి యానందావహంబగుగాలిమంచు మ॥రా॥రా॥ కాకాని పుండరీకాక్షుడుపంతులుగారును మ॥రా॥రా॥ చిమమాటిళ్ళ లక్ష్మీనారాయణప్రసాద్ నాయుఁడు (ప్రొబేషనరి డిప్యూటీతహశిల్దార్, గుంటూరు) గారునందుకుఁ బూనుకొని యీనెల 1వ తేదిని జరుగునట్లుద్దాని నేర్పాటుగావించి ప్రకటనాపత్రికల నచ్చొత్తించి యెల్లరకుఁ దెలియఁజేసిరి ఒకరిద్దఱు పెద్దలకుమాత్రమా పత్రిక వచ్చియుండదయ్యె అదిబహుశః లేఖరుల పొరపాటయియుండును.

ఈనెల 1వ తేదినిఁ గ్లుప్తకాలంబనఁగాఁ బంద్రెండు గంటలకు నవధానమహోత్సవము జరుగఁబోవు గుంటూరునందలి ద్వితీయనాటకశాల సర్వసుహృత్ప్రదంబై యన్నిట నద్వితీయంబై వెలిం గెనాఁడు విచ్చేసినవారిలోసర్కారుద్యోగస్థులుఁ, ప్లీడర్లు, మొదలగువారుండిరి. సర్కారుద్యోగస్థులలో మ-రా-రా॥ పెమ్మరాజు కామరాజుపంతులుగారు (డిప్యూటీకలెక్టరు,గుంటూరు) మ-రా-రా॥ మందపాటి లక్ష్మీనారాయణ పంతులు గారు, (తహశిల్దారు) మ-రా-రా॥ గిరిరావు పంతులు గారు, (టవును సబ్ మేజస్ట్రీటు

మ-రా-శ్రీ॥ చిరుమామిళ్ళ లక్ష్మీనారాయణప్రసాద్ నాయుడుగారు (ఫో౯. డి. తి.) పోలీసు యిన్‌స్పెక్టరు, (ముపల్ మానులు) సబ్ ఇన్‌స్పెక్టరు, కానిస్టేబిలులును, తేవందీర్చియుండిరి. ప్లీడర్లలో మహారాజశ్రీ ఏకా రామయ్యపంతులుగారు. వ్యు. రంగారావుపంతులుగారు మొదలగువారుండిరి. డిప్యూటీకలెక్టరుగారిసరసను మ-రా-శ్రీ॥ వింజమూరి భావనాచార్యులవారు దయచేసియుండిరి. అప్పటికి నెంటిగంటయాయెను? కవీశ్వరులును వచ్చిరి. వారిరాకఁజూచి సదెంపల్లి పట్టాభిరామయ్యగారు పృచ్ఛకులఁ గూర్చుండఁబెట్టసాగిరి. ఇంతలోనే కొందఱు వైశ్యులును, వైదికులును పృచ్ఛకులుగనుండఁ బ్రయత్నించి యనాహూతులయ్యు శిష్టులుకాకయు రంగమునఁ జేరి కూర్చుండిరి. వారిలో మ-రా-శ్రీ॥ వ్యు. రంగారావుపంతులుగారొకరు, అంతటఁ గవిద్వితయంబు సభాసనాధిపత్యము వహించి మహారాజశ్రీ పాటిబండ వెంకటరమణయ్యపంతులుగారు (ప్లీడరు, బెజవాడ) నుచితాసనంబులఁగైకొని సభకుఁబూర్ణాద్వైతభావంబుఁగూర్చిరి. అంతటఁ బృచ్ఛకులలో నొకరగు మ-రా-రా॥ వ్యు. రంగారావుపంతులుగారు సరిగా నూరుమందికి నవధానము సేయఁ జూడఁగుతూహలముకలదని యాసనాధిపతికి విన్నవించిరి అట్లు చేయుటకుఁగాలము చాలఁగావలయుననియుఁ, దానికిఁబదినములుండుటకు వీలు లేదనియు నైనను నలుబదిమందికో మఱికొంతమందికో చెప్పినఁజాలదా యనుచుఁ బరిపూర్ణశతావధానము సేయుటకువీలు లేదని చెప్పిరి. అంతటఁగవులు స్వప్రజ్ఞం జాటుచు నూఱుగురికైన మఱెందరికైన నవధానము సేయఁ గలమంచనిరి. తరువాత సవధానము నొక్కరొక్కరు గవివరులలో బాపట్లలోఁ జేసిరిగాన నిచ్చటసోదరులిద్దరునుగలిసి యవధానము చేసిన బాగుండుననిని వ్యు. రంగారావుపంతులుగారు తమయభిమతం

బును దెలిపిరి అదియు నయ్యగ్రాసనాధిపుండు వారించెను. కాని స
హేతుకంబుగఁగాదు. పిమ్మట మ-రా-రా॥ వు. రంగారావుపంతు
లుగారు పృచ్ఛకు లెవరుగానుండవలయునను సంశయమును నిర్ధారణ చే
యవలసినదిగా నగ్రాసనాధిపతిగారి చెవిని వేసిరి. అందువిషయము
లో నేర్పఱించుట దుర్లభమని యగ్రాసనాధిపతిగారనిరి. అనంతర
మవధానముసాగెను.

"రామాయణములోఁ బిడకలకొట్లాట" యన్నట్లు లోకచిన్ని
కలయవధానమధ్యమందు జరిగెను. ఇద్దఱుపిల్లకాయలు (బహుశః
వారిరువురు ద్వైతులు యయ్యెనొక్క తెగవారుకానట్లు తోఁచుచున్నది)
నాఁటియవధానముఁగూర్చియో యవధానులంగూర్చియో? (ఇది
సభ్యమంబు స్పష్టముగ నేర్పరింప రాకుండె) పిల్లజగడము పెట్టికొని
కర్ణాశ్వత్థామకథఁ జక్కఁగ జ్ఞప్తికిదెచ్చిరి. ఇట్లుండ డిప్టీకలెక్టరు
గారు తమతావుననే లేచినిల్చిరి. సబ్ ఇన్స్పెక్టరుగారు రంగంబులోని
కివచ్చి యాపిల్లకాయల విడఁదీసి యొకసభికుని నెట్టుచుండ "అయ్యా
అతనుమనవాఁడండి,, యనియొక నియోగి సబ్ మేజస్ట్రీటుగారితో
ననిరి. ఈయవసరంబున రంగంబు నలంకరించిన పృచ్ఛకులు లేచినిలి
చిరి నిలచినవారల ను-క్ష్మా-ర॥ భావనాచార్యులగారు "మేజస్ట్రీటు
గారు మిమ్ముఁగూర్చుండనాజ్ఞాపించుచున్నారు,, అనిసింహనాదంబు
చేసిరి. ఇంతటిలోనే సబ్ మేజస్ట్రీటుగారును రంగమునఁ బ్రవేశించి
సంభ్రమంబుణపడఁదొడఁగిరి. అంతట పృచ్ఛకులలోఁగొందఱు పె
ద్దమనుష్యులు తమకడియల్ల నవమానముగఁ బరిణమించునేమోయని
విశంకించి లేచిపోవనుద్యుక్తులైరి. కొందఱు లేచివెళ్ళిరి. కొందఱి
ను సబ్ మేజస్ట్రీటుగారు తమరుపోవఁగూడదని సన్మానించి మఱలఁ
గూర్చుండఁబెట్టిరి. అంతటఁ దొందరలన్నియునణఁగి తిరిగి యవ
ధానము ప్రారంభమాయెను. నాఁడు నలువదియొక్కమంది పృచ్ఛకు
లు గూర్చుండిరి. (సశేషము) యన్. రంగారావు.

శ్రీ

శ్రీ హయగ్రీవాయనమః

బ్రహ్మశ్రీ తిరుపతి వేంకటేశ్వరకవులకు.

అయ్యా

మీరు నరసారావుపేటలో యీసంవత్సరము అక్టోబరు 1 2 తారీఖుల శతావధానమును నేను చే10మందికి సభఁ జేయునపుడొక పృచ్ఛకుఁడు "పశ్యాపశ్యోనపశ్యతి" అనుసమస్యనిచ్చి పూరింపుఁడనఁగానా సమస్య తప్పని చెప్పి, పృచ్ఛకుఁడిది పండితు లొప్పుకొనినదియే తప్పుగాదనిపల్కఁగా, ఎవరా పండితులు పండితులైన నిట్టి తప్పుసమస్య నేల యొప్పుకొను,నని పండితదూషణం జేసితిరి కదా. అంతపైఁ గొందఱు పండితులీ సమస్య తప్పుగాదని మేము సమర్థింపఁగలమనియు మీరు తప్పనిసమర్థింపఁగలరేని సభకురావలసిందనియు మీరుతప్పని ప్రకటించినయెడల మేము నూటపదాఱులిచ్చెదమనియు ప్రకటించలేనియెడల మాకు మీరు నూటపదాఱులిచ్చిపోవలయునని యుత్తరము వ్రాసి పంపఁగా ప్రత్యుత్తరమీయక నరసారావుపేటనుండి గుంటూరునకు వెళ్లితిరి ఇంతవరకుఁ దగిన ప్రత్యుత్తరమిచ్చిన వారుకారు. కావున నిప్పటికైనను స్వవచనపోషణసామర్థ్యమున్న యెడల వట్టియుక్తులు పన్ని కాలము వ్యర్థపుచ్చక తప్పని నిశ్చయపరచుట కొప్పుకొని తెలియపరచిన తక్షణమే పండితసభఁ జేయించుటకును ఆసమస్య తప్పుగాదని సమర్థించుటకును, మీరిది తప్పనుటయే తప్పని ప్రకటనపరచుటకును గృతనిశ్చయుఁడనై యున్నాఁడను

ఇట్లు

1-11-11

బ్రహ్మశ్రీ బెల్లంకొండ రామారాయ
కవీంద్రుల శిష్యుఁడగు
ముబుకుట్ల లక్ష్మీనారాయణశాస్త్రి



* శ్రీ మత్సరదేవతాయై నమః *

మ॥ రా॥ శ్రీ బెల్లంకొండ రామరాయ కవీంద్రుల శిష్యులు
బ్రహ్మశ్రీ ములుకుట్ల లక్ష్మీనారాయణ శాస్త్రిలవారికి
చక్రవర్తుల సుబ్బరాయశాస్త్రి వ్రాయు.

# విద్యావివాద పత్రిక

అయ్యా,

తాము ప్రకటించి పంచిపెట్టుచున్న అచ్చుపత్రికను జూచితిని. అందున్న తప్పులవలన మీరు మహాపండితులని తేలినది. మీ మాటట్టులుంచి మీరెవరి శిష్యులమని వ్రాసికొంటిరో వారి గ్రంథములలో శ్రీకృష్ణలీలాతరంగిణి నొక్కింత పరిశీలించితిని. ఎక్కడఁ జూచినను బూతులే నిజముగా పచ్చిబూతులే పొడకట్టినవి. అబూతుల నిక్కడ నుదాహరించుటకు రాజశాసన మొప్పదుగావున నాగ్రంథములో నెక్కడ నున్నవో ఆవిషయమును దెల్పుచున్నాఁడను. అవి తాము చూచుకొని పిమ్మట తమ గురువులకుఁజూపి వానికేమైన సమాధానము చెప్పఁగల్గినచోఁ జెప్పుటయు లేనిచో నట్టి పచ్చిబూతుపద్యములను వ్రాయుట తప్పని లిఖితపూర్వకముగాఁ బ్రకటించుటయు జరుపవలయునని నాయభిప్రాయము. తారతమ్యజ్ఞానమెఱుఁగక తాము ధిక్కారపత్రికలు ప్రకటించుటను వారింపని మీగురువులకును వారిని వృథాగా నిట్టిపనిలోనికి దింపిన మఱికొందఱు నరసారావుపేట గుంటూరుపురవాసులకును దగు హితోపదేశమును జేయనెంచి యిందులకుఁ బూనుకొన్న నన్నుఁ బండితమండలి క్షమించుఁగాక. మీరేకాక నేనుజూపు దోషముల కెవరు సమాధాన మిచ్చినను శిరసావహించుచున్నాఁడను.

## * దోషముల పట్టిక. *

| పుటసంఖ్య. | శ్లోకసంఖ్య. | పుటసంఖ్య. | శ్లోకసంఖ్య. |
|---|---|---|---|
| 4 | 32 | 79 | 118 |
| 5 | 39 | 79 | 120 |
| 43 | 37 | 79 | 121 |
| 45 | 50 | 79 | 122 |
| 50 | 85 | 80 | 129 |
| 68 | 37 | 82 | 138 |
| 70 | 54 | 82 | 142 |
| 70 | 55 | 82 | 144 |
| 75 | 91 | 83 | 152 |
| 75 | 92 | 84 | 154 |
| 78 | 114 | 85 | 162 |
| 78 | 115 | 107 | 77 |

పైనుదాహరించిన శ్లోకములలోఁ గొన్నిఁటిలోఁ గేవలము పచ్చి బూతులును గొన్నిఁటిలో బూతులును నున్నవి. ఇది యేశిష్యునకును నేగురువును బాఠముఁజెప్పఁడు సరిగదా! పైలకాపరులుఁగూడ వీనిన ర్థము తెలిసినచో ధ్రువముగాఁ బఠించుట కేవగించుకొందురు ఇట్టి జుగుప్సాకరములగు కృత్యములకు శ్రీకృష్ణపరబ్రహ్మమును గర్తగా నేర్పఱచి కవిత చెప్పిన వారొక కవీంద్రులా! వారికి మీరుశిష్యులా! మీరు పండితకవులపైఁ గాలుద్రవ్వుటా! ఎంత సౌడభ్యముగానో యున్నది. కానిండు. మీ కాలుద్రవ్వుటను నేను వారింపఁజూనితిని గాన మీరో మీ గురువులో పైసంగతుల కుత్తరమిచ్చి పిదప "పశ్యాంపుశ్యాం" సమస్యనుగూర్చియడుగుదురుగాక. గ్రంథవిస్తరభీతిచే నుపేక్షించితినిగాని బోలెండు వ్యాకరణదోషములుకూడనున్నవి. బూతులలో వ్యాకరణపుఁ దప్పులను జూపుటకు పండితులొప్పరని యీవిషయమును బ్రకృత ముపేక్షించితిని. ఇందులకుఁ ద్వరలో నుత్తరమిత్తురుగాక. లేనిచో మీరును మీ గురువులును నోడిన ట్లియని మీ పేరె వ్రాయకున్నను లోకమే భావించుకొనుఁగాక.

చక్రవర్తుల సుబ్బారాయశాస్త్రి.



శ్రీమత్పరదేవతాయైనమః

మహారాజశ్రీ శ్రీరాజామంత్రిప్రగ్గడ భుజంగరావు బహద్దరు జమీాందారు వారిసన్నిధికి,

అయ్యా,

"వివాహమహోత్సవాశీర్వచన పద్యరత్నావళి యను పత్రిక పోస్టుమూలమున మాకందినది, దానింజూచినతోడనే కలిగిన యానందమును" ఇదమిత్థమని వ్రాయఁజాలని యశక్తతనుమన్నింపవేఁడెదము, ఆపత్రికలో ననవసరముగా మమ్మును గొప్పరపుఁగవులను గూర్చిన తారతమ్యచర్చనిఱికించి సిద్ధాంతమొనర్చిన యంశమువలనఁ దమ్మును మేమభినవ విక్రమార్కులో భోజులోయని కొనియాడవలసియున్నది. గుంటూరుశతావధానసభలో "ఆసనచర్చయెంత యుక్తియుక్తముగనున్నదో యీరామాయణములో పిడుకలవేట్లాటయు నంతే యని వ్రాయవలసివచ్చినందులకు మిగులఁ జింతిల్లుచున్నారము, మా యుభయుల విషయమై చర్చించిన యంశములన్నియు ఖండఖండములుగా ఖండింపఁదగినవియేయైనను దేవరవారుకూడ నాటిసభలో నాసనచర్చచేసి సభనుపీడిదయచేసినవారిలో నొకరగుటచేఁ దమరెంతనిష్పక్షపాతముగా వ్రాసితిమనుకొనుచున్నను నయ్యది శాఖాభిమానదోషదూషితముగాకుండనుండదనియెవ్వరుననుకొనరనియెంచియాయుద్యమమునకుదిగక కొన్ని ప్రశ్నములనడిగి సంశయములనుమాత్రము తీర్చుకొననెంచితిమి, తమంతటఁదామే కలుగఁజేసికొన్న విషయముగాన నీయెడల నుదాసీనులు గాకుండుటకుఁ బ్రార్థించుచున్నారము.

(1) తిరుపతి వెంకటేశ్వరుల యవధానమునకేర్పడిన సభలోఁ గొప్పరపువారికున్నతాసనము కావలయునేని, విద్వాంసులును గవులును, జమీాందారులును, మఱియు ననేక సుగుణగణవిరాజితులును నగుదేవర

వారికిఁగూడ నున్నతాసనమేల యుక్కఱలేకపోయెను? గొప్పగొప్ప యుద్యోగపదవులలోనున్న వారనేకులున్నను గవితావిషయికమగు సభగావున నందుఁబూర్ణమైనప్రవేశముగలతామువిధిగాగౌరవింపఁదగినవారు కదా! మేము వ్రాయుటయేకాక తాముకవులైనవిషయమును, అవధానులయిన విషయమును, విద్వాంసులైన విషయమును తమపత్రికలోని

సీ॥ అష్టావధానంబునాచరించితినేను
సంస్కృతంబునుగొంతఁ జదివియుంటి
నాటకంబులువచనములుప్రబంధముల్
నవలలుమున్నుగావివిధకావ్య
విరచనఁజేసితి నిరుపమానంబగు
కవితారసాస్వాద కలనఁగంటి
గ్రంథంబులును బెక్కుఁగాంచితిబండిత
కవులలోఁబలుమఱుఁ గలియుచుంటిఁ॥
గీ॥ గానియీగతి వాదముల్ గాననైతి
విబుధవరులార! నాదొక్కవిన్నపంబు
ఇచ్చదీరంగఁ బోరులగ్రచ్చుకొనుడు
దానిఫలమెద్దియో దయఁబూనిచెపుడు॥

అనుపద్యముగూడఁ దెల్పుచున్నది! ఈసంశయమును బాపవేఁడెదము.

(2) మఱియు నాసభలో మఱియెవ్వరును నవధానులులేరా! ఉన్నట్లు దేవరయొప్పుకొన్నచో వారినందఱ నుపేక్షించి వీరికే యున్నతాసన చర్చ యేలకలుగవలెను!

[3] వెండియు దేవరప్రకృతవిషయమును వైదికనియోగ కక్షులలోనికి నాకర్షించుచున్నారు గదా! అందులకు సంబంధించినమాటలేమైన నాఁటిసభలోవచ్చినవా! అగ్రాసనాధిపతిగారుగాని తదితరులుగాని నియోగికవులుగాన వైదికకవుల ప్రక్కఁగూర్చుండఁదగరని నొడివిరా! అట్టి ప్రసక్తియేలేనిచోఁ దాము దీనినిట్లు పరిణమింపఁజేయుట సాహసమాత్ర మనుకొనవలసివచ్చినది.

(4) విద్వత్కవులనియు, అవిద్వత్కవులనియు రెండుతెగలు కవుల లో ననాదిగానున్నదనుటకు దేవరయొప్పికొందురా! లేదా! ఒప్పికొన్నచో వారికిని వీరికిని విద్యావిషయకమగు గౌరవముసమానముగా జరుపుటకంగీకరింతురా! ఈవిషయమున భవభూతి, పండితరాయాదుల పోకడలించుక చదివి పిమ్మట నుత్తరింపఁగోరెదము.

[5] కవిత్వమననేమి, ఆశుకవిత్వమననేమి, కవిత్వమును సప్తసంతానములలోఁ జేర్చుటకుంగతమేమి, ఈయంశములను సమగ్రముగా వివరింపవేఁడెదము.

[6] మాకును గొప్పరపుసోదరులకును గవిత్వమననేమి పాండిత్యమననేమి తారతమ్యమును నిర్ణయింపఁబూనుకొనియే యున్నారు కావున వారికిఁదెలిసి మాకుఁదెలియని వెన్నివిషయములుకలవో మాకుఁదెలిసి వారికిఁ దెలియనివిషయములెన్నిగలవో విస్పష్టముగా వ్రాయించవేఁడెదము, లేదా! విద్వత్ప్రభువులుగావునఁ దగిన విద్వాంసులరప్పించి సభచేయించి యాయాయంశములను బండితమూలమున నేర్పాటుచేయించి యశమునందఁ బ్రార్థించుచున్నారము.

[7] వృథాగా శాఖాభిమానమును దమబోటులుకూడవహించి యథార్థవాది సత్యవాది నామములతో వ్రాయువారివ్రాఁతలు విశ్వసించి యేదోయొక పక్షమవలంబించి వేఱొకపక్షమువారిని నేర్పుగా దూలనాడుట యెంతవఱకుయుక్తమో మేమరయఁజాలకున్నారము.

[8] గద్వాలాదులలో మాకుఁగలహమువచ్చినదనినిరసనభావముగా వ్రాయించియున్నారుకదా! అదితమవలె నచ్చటిప్రభువులుగూడ నిరసించినచో మేమేమికావలయునో! ఆప్రభువులెంతచక్కఁగాఁ బరీక్షించి తగవుదీర్చిరో యిప్పుడేని బరిశీలింపఁ బ్రార్థితులు.

[9] శిష్యులవిషయమై యేదోమాకుఁగలహముకల్గినదని యిందుఁ గొంత నిరసించియున్నారు, సమ్మతమే కాని, ఆవిషయమైన యావద్విషయమును దామువిన్నచో నాకలహకారకులెవ్వరో పూర్తిగాఁదెలియును, దానికొఱకేగదా గీరతమువ్రాయుచుంటిమి, అదివీక్షించినపిమ్మటఁ గూడఁ దమరీమాటనే సెలవిచ్చినయెడల శిరసావహించుచున్నారము.

[10] వైదికనియోగి కవులవిషయమున మెమెట్టియభిప్రాయము కలవారమో నేటికిఁ జిరకాలముక్రిందట మాచేనచ్చొత్తింపఁబడిన "పల్లెటూళ్లో పట్టుదలలు" తమమంజువాణీపత్రికయె ప్రకటించినది గావున నది చిత్తగింపఁ బ్రార్థితులు.

[11] ఇఁక నేనిఁదామీగుంటూరు పురపుఁజర్చకుఁగారకులు మేముగాని కొప్పరపువారుకాని కారనియు నొకరి పెండ్లిలో వేఱొకరినిగూఁడ జతురంతయానమున నిఱికింపనెంచు మహానుభావు లేయనియుఁబూర్తిగావిశ్వసించి ఘనమగు తమహృదయమును బత్రికాముఖాలమునఁ బ్రకటించుచు లోకుల సంశయమును దొలగింతురని నమ్ముచున్నారము, ఈయంశము నయాచితముగా గొప్పగొప్ప పదవులలోనున్న విద్వచ్ఛేఖరులు మావద్దకిదివఱకే పంపియున్నారు, వలసినచో వానికిసరియైన నకళ్లను దేవరవారిసన్నిధి కంపికొనుచున్నారము, వారుమాకన్న నధికులగుటటులుండ దేవరవారికన్నఁ గూడనిట్టితీర్పులయెడలఁ గడుమిన్నలని వ్రసిడెన్నియెల్ల నొప్పుకొనఁదగువారని మనవిచేసికొనుచు నిందలితప్పులను మన్నింపవేఁడికొనుచు నింతతో విరమించుచున్నారము.

ఇట్లు
తిరుపతి వేంకటేశ్వరకవులు.



కం॥ జగదీశుఁడైనశంభుఁడు, దిగ్భ్రమింగఁగ వెలిచి కంఠదేశంబున నుం
డఁగనిల్పె నాయుఁడీవిష, మగణితముగఁ ద్రావె నిదిమహాత్మ్యతమననిక్ ,, 169

తే॥ అనుచునాయకురాలు నిజాంతరంగ, మునసుదలపోసె ''వసిబిలంబునను గరళ
మునను సముచూని యీమహాత్మునను నెట్టి, మాయఘుటియింతు నింకేమిసేయుదాన,,

వ॥ అని చింతింపుచు. 171

సీ॥ ఒకచోటఁదగరుల నొకచోటఁబటుబలీవర్ధనంబుల నొక్కవంకమహిష
యుగళంబు నొకచోటఁబగినడేగల నొక్కయెూరఁగాలజ్ఞానయుగ్మములను
డింభకద్వయముల డీకొని పోరాటఁగల్పించి రాజమార్గంబులోన
నోడినజంతువు లోనరనాయునివని గెలిసేయుచుఁ దెక్కకేరడములు
గెల్చినవియెల్లనావని కేకలిడుచు, రవళిసేయుచు నాయకురాలు పెక్కు
కథలుపన్నుచునుండె నంకురులఁగూడి, పురజనంబులుగుంపులై బోరుకొనఁగ. 172

కం॥ ఎటువచ్చునొనాయుండని, కుటిలాలోకమనములోన: గొంకకవీథిక్
గటుభావలభర్జింపుచు, భటులంగాపుంచె నభయపార్శ్వయులందుక్ 173

వ॥ ఇట్లుసజీవద్యూతంబులం బ్రతిపక్షజిగీషామనీషయై యుండునప్పుడు 174

మ॥ పతియుం దానును నాయునాత్మజనముల్ పక్వాన్నపానాది వ
స్తుతతుల్ భుక్తియొనర్చి వార్చి యనురక్తుల్ మీఱ వీటీరస
ప్లుతవక్త్రాబ్జములొప్ప గాత్రములఁగస్తూరాగరూచ్చాంగరా
గతనొప్పారి సభాస్థలంబున నలంకారంబుశోభిల్లఁగక్. 175

కం॥ మృగరాజపీఠముల నుం, డఁగ నాయుండిట్లులనియె నరనాథునితో
''నగరాజధర ! వినుమీ, నగరెల్లక్ శిథిలమై విన మతనొందెక్. 176

ఆ॥ శిథిలమైనదనుచు బుధులుచెప్పగవిని, లలితకాష్ఠసమితి లాడెమాది
వాలుకంబుమొదలు వలయువస్తువులెల్లఁ, బెట్టిపంపినాఁడఁ బేర్మితోడ. 177

కం॥ చూరిమర,,మ్మనినాయుఁడు, చేతోముదమొప్ప నృపునిచెయివట్టి జన
వ్రాతమువెనుకొనఁజని దు, ర్నీతులఁజూపించె దొడ్డినిండెనవారిక్. 178

మత్తకో॥ అత్తఱిం గృకవాకుయుగ్మ మహారణంబుననుబ్బి యు
ల్లత్తినాయకురాలుమిక్కిలి హేళనంబుననాయుఁడీ

యొత్తునంబరిభూతినొందె విహీనపౌరుషమూర్తియై
తత్తఱంబునవంచుబల్కె నుదాత్తవిక్రమశీలయై. 179

సీ॥ "ఓడిపోయిన కోఁచఁకోడినిజూచి యోనాయుఁడ! బంధుజనంబువిడిచి
పంచినమాడ్కి పటుధాన్యములుమాని మందిరోద్యాన సంపదలువదలి
గజతురగాందోళికంబులదగనాడి దండఖడ్గాది సాధనలువిడిచి
ఛత్రచామరముఖ్య చయచిహ్నములుమాని కలిసివర్తించు కింకరులవిడిచి
తఱుమనేలేశ్వరపురేవుదాఁటి విఱిగి, పోపపోయెదు మతిదిన్నఁబోకు నీకుఁ
బౌరుషంబెక్కడిది సాటివారునవ్వ,, ననుచుఘూర్ణిల్లిపలికె నయ్యంబుజాక్షి. 180

వ॥ అప్పుడు. 181

కం॥ అదివిని నాయుఁడా సతి, కెరలించి మహోగ్రకోపహృదయుండై య 182
చ్చటనున్నజనంబులు, బెదరఁగనిటనియె నిండుబీరముతోడన్

శా॥ "ఏమేమీ? వినవైతి నింకనొకమా టివ్వాఁడు భాషింపవే
భామా!,,యంచు గిఱుక్కునందిరిగి శుంభద్విక్రమోపేతుఁడై
సామీప్యంబునకేగిఁ జూచి పలికెం జాద్వాకి,,యోవీర! నీ
సామర్థ్యంబిఁకనేల? యోడితివి మాత్సర్యంబుఁజాలింపుమీ. 183

ఆ॥ చాలునింక నీదుచరణాయుధంబోడె, గెలిచెనాఖగంబు కేవలంబు
మగువకోడినట్టి మగవారుకలరె? ము,ల్లోకములనటంచుఁ గేకలిడితి,, 184

మ॥ అనినంగన్నమఁజూచి నాయుఁడనుఁ "బుత్రా! యీయసద్భావుచే
సినకౌటిల్యరణంబుఁజూతమిట నాక్షేపించివీఁకంగెఱల్
కొనగోటన్ శిఖియించివేడ్క నలుదిక్కుల్ చూచి యంకాళశ
క్తిని బిన్నక్కను మానసంబునఁ దగంగీర్తింపు సద్భక్తితో,, 185

వ॥ అనినిర్దేశించిన 186

సీ॥ కులదైవమైన మాలులువేల్పు చెన్నుని సదమలపదసరోజంబులాన
పరమేశ్వరాభిన్నభారరూపంబునఁడనరు నంకాళపదంబులాన
హనుమంతుతిరుమణి యక్కపిన్నక్క దివ్యారుణాంఘ్రి సరోరుహంబులాన
పద్మాక్షు నపరరూపంబునానొప్పిన నాయుని మృదుచరణంబులాన 187

పెనుకునను గోఁచకోడి యోడినజయంబు, గలుగ నుండిన,, నను చురేఖలు లిఖించెఁ
బరఁగ శ్రీచక్రవానకు భూపురములట్లు, వెఱఁగుపడి పౌరజనము లద్భుతయనంగ 188

వ॥ అట్టియెడ 189

కం॥ పరుగెత్తియోడి పాఱిన, చరణాయుధ మెనురుదిరిగి చరణాగ్రహతిన్
బరిపంధిత్రోవఁ జూడన్, స్ఫురదంగము రక్తసిక్తముగఁ జేసె వడిన్ 190

కం॥ వటిమ యొకపుంజుఁ దెచ్చినఁ, బటిమున్ దత్తనువు జరణహతిఁ దూలింపన్
బటిమాలము నెత్తుగొలుకఁగ, వెలిచి తెగంబాఱె జనులు వికవికనవ్వన్ 191

చం॥ పదఁపడి యొక్కకోడి నటు పందెము గట్టిన నెక్కుదాని మై
చిదురుపలై ధరంబడఁగఁ జిమ్మి నఖాగ్రములన్ విదిల్చి య
మ్మదపతి దెచ్చు కుక్కుటసమాజము నొక్కటి చిక్కకుండ ని
ట్టదలచి కోఁచకోడి జలదారవమొప్పఁగ నిక్కి కూసినన్ 192

కం॥ నాయకుని కీనెమాముఁ జూపన్, నాయకురాల్ సిగ్గున నుజనంగని పౌరుల్
జే యనిత హంగీర్తింపఁగ, నాయుసఘుండిట్టులనియె నాయమతోడన్ 193

శా॥ "విశ్వాసమ్మొకయింతలేక నను నుర్వీనాథుఁ డాప్తుల్ వినన్
శశ్వత్కోపరిమూఢనాద్యపుల హాస్యంబిట్లు కావింప నీ
కైశ్వర్యంబొనఁగూడెనో ? మిగుల శౌర్యస్ఫూర్తి శోభిల్లెనో
విశ్వస్తా ! యిఁక నేమిచేసెదు ననున్ వీక్షింపసిగ్గేటికిన్,, 194

కం॥ అనవిని నాయకురాలి, ట్లను "నాయుఁడ! నీదురాగ్రహంబున నాకో
ళ్లనుజంపిపోవఁ బోని, త్తునె ? యింకొకపందెమిచట దొరకొనఁ కుండన్ 195

ఆ॥ పందెమునకుఁ బిలువ బాఱిపోవఁగ నీకుఁ, బౌరుషంబె ? విగతభయుండ వీవు
పొలఁతిపిలువ నోడి పోయిన సామంత, రాజవరుఁ డనవ్వరా ? మహాత్మ !,, 196

కం॥ అనవుడు నాయకుఁడు "నాల్గేన్, దినములు గడుపెత్తు నెమ్మదిం జని నీ పెం
చ్చిన కోడిఁ దెమ్ము పందెమ్ము నగెల్చెదఁ గాక యెంతుఁ బోయెద నింకన్ 197

కం॥ అని చెప్పి నాయకుఁడేగిన, వనిత నిజాంతర్గతమున వవరుచు దేశం
బునఁ బల్లెల్లెల్లఁ దప్పక, చని వెదకెడి వారిఁ బంచె జంఘాలికులన్ 198

కం॥ కాదనక వేగ వేఁగఁగ । రాదా నీవైనఁ గాని? రాకా రజనీ
పాదేలి? రాజు వలచిన । దే దేవుల సానియనఁగఁ దెలియమెనినున్ ॥

కం॥ అనిమాఁటి దూరితాపో । దనిరతి చేఁ దారి దారితమనోరథలై
వనరు వనరుహదళాక్షులఁ । గనుఁగొని కనుఁగొనల నీరు గ్రమ్మఁగ సిరియున్ 81

చం॥ అనుపమదక్షిణానిలము నైంచ వసాంద్రహిమాంబుఁ బైకొనన్
బనివడి వెచ్చనూర్చుచును బొమ్మలు లోల్కఁగ "గాలి వాన వ
చ్చినఁ గతమా"నన్నటులఁ జేష్టలు దక్కఁ బయోధిరాజపు
త్రిని నుచితోపచారములఁ దేర్చుచు నెచ్చెలి పల్కె నేర్పునన్ 82

తే॥ "చెఱకువిల్లుండఁ జిలుకలు చిదిమి వైచు । నళుల నిస్సారమొనరించు నలరువిల్లుఁ
జిగురుసిలుపూనఁ గోవెలల్ చిదిమిపెట్టు । మదనుఁ డేరీతి ధన్వియై మంతుకెక్కె

వ. అదియునుంగాక 84

చం॥ కలికి! జవాజివాసనల గాలికిఁ జిల్కయుఁ జిల్కబోద వె
న్నెలముగి రామ రామనఁ బికంబు పికంబుఁ గుహూయనన్ విధుం
డల విధుఁ గాంచి తమ్ములలయన్ సొలయన్ రహించఁడుండనె
న్నెలమిసునన్ మరుండు భయ మేటికి మాటికి ఏవికె వెలీ!" 85

మ॥ అనుచున్ నేర్పున సేద దేర్చి "సరి ప్రొద్దయ్యెం గదా యొంటినీ
వనినుండం దగ"దంచు నిండరనిజావాసంబునం జేర్చి "నే
నోనఁగూర్తున్ భవదీప్సితం"బనుచు నుద్యోగించి యయ్యబ్జగే
హిని హస్తార్పితకంజముం గొని వడిన్ హేమాంబరుం జేరఁగన్ 86

వ॥ ఇట్లు చనుదెంచిన 87

సీ॥ లోకశాసనపాక పాకశాసనలోక భూజభోజన నిష్కుటాజిరములు
హైమసంగతధామ ధామసంగతహైమ కరశిలాజ్వాలకేళికాగృహములు
చిత్రజాలకపాత్ర పాత్రజాలకచిత్ర మణివితానస్థాన మంటపములు
రాగసారసమాగ మాగసారసమాగ సంతానకాంత సౌధాంతరములు
కలయఁ బరికింపుచును గొంచకలయసురభి । మలయపవనప్రరోహముల్ మలయరత్న
వలయవేదిని మేదినీవలయభర్త । యలయఁ దనుతాపతప్తుఁడై యలయఁ గనియె

వ॥ కని చేరం జనునవసరంబునఁ జిత్రగతసింధుసుతవిరహతాపంబున నతండు దనలోన

మ॥ శితబుధు లెన్నం గుసుమాకరద్యుతి ముఖశ్రీఁ జూడఁ జంద్రోదయ
స్థితి గావ్యోవి సౌంగురంగుదలఁపం జింతామణిస్ఫూర్తి "యో
సతి! ప్రాణేశ్వరి!" యంచు భావనల నిచ్చల్ తద్రుచిం జొక్కి "యే
గతి యీయంగజతాపమింక" నని కాఁకం జెందె శ్రీకామియున్ ౯౦

చం॥ కలువల రేని వేఁడికిని గంతుని దాడికిఁ బూవుటంపగో
లల బలువాఁడికిన్ ధృతిగలంగ మదిం దిగనాడి దేహమ
గ్గలముగ వాడి సోలుతఱి గ్రమ్మిన చెచ్చెరి నెఱి తమ్మిపూ
వలపుల దెమ్మెరం జలదవర్ణుఁడు గ్రక్కున సేదదేఱుచున్ ౯౧

ఉ॥ "ప్రాణసమానమాగమమహాహవసూచకమయ్యె నీజగ
త్ప్రాణవిహార" మంచు మదిఁ బట్టగరానిముదంబునందుచో
శ్రీనలినాయతాక్షి చెలి "సేమముకల్గుత నీకు నంబురు
ట్పాణి వయస్య నీప్సితశుభంబొనఁగూర్తు" నటంచుఁ దెల్పుచున్ ౯౨

కం॥ హెచ్చిన ప్రియమున సిరిచేఁ । దెచ్చిన పత్త్తమ్మిగొమ్మ నఁగి "దేవా! నీపై
నచ్చినసతి పైకానుక! నిచ్చిన" దని విన్నవింప నింపునహరియున్ ౯౩

చం॥ శయమున నాకు శేశయము సంభ్రమలీల గ్రహించి మొక్కుచున్
వయనము లంబుజాంతరమునం దగనొత్తుచు నుత్సవాబ్ధి వి
స్మయమున నోలలాడుచు రమాపరిరంభసుఖైకసాత్త్వికో
దయమునఁ దేలిన ట్లలరె దైవశిఖామణి వల్కెఁ గూరిమిన్ ౯౪

మ॥ "వనమధ్యంబునఁ జిత్రపత్రరుచులన్ వర్తిల్లి సూర్యావలో
కనముం జేయుచు సాధుమాధుకరలోకం బెన్న సంస్కారవా
సన ప్రాపించిన మానసప్రియవిరాజద్యోగనిషంగదా
యనఘ శ్రీకరయుక్తవైభవము నీ కర్పించె నబ్జోత్తమా! ౯౫

శా॥ ఆలేఖ్యాకృతి కారమా సతికి నుద్యత్పాదపీఠంబవై
కేళీగేహమవై కళాభరణమై క్రీడావతంసంబవై
లాలిత్యంబున మించు నీ సరసలీలన్ సౌకుమార్యస్థితుల్
సౌలభ్యంబు గణింపశక్యమె? సరోజాతాన్వయగ్రామణి! ౯౬

కం॥ తలఁచిన నడు రేయైనన్ । దళములు గూర్చుకొని కుసుమధన్వికి జయమున్
వెలయింతువు కాంతస్థితి । నలరుచు దయదోలఁ నీరజాన్వయతిలకా ౯౭

మ॥ ఆజానింగాంచిన మేటిదానవము సప్తాశ్వైకధామానుభూ
త్యజహాత్రిపతి విశానమొంది యతనుగ్రామాఘుబాణాకృతిన్
విజయంబందిన నీవె నేడగుట భావింపన్ మదీయాంతరం
గజసంతాపముఁదీర్పవచ్చితివొ? వేడ్కన్ వారిజాతాగ్రణీ! 98

కం॥ నినుఁ జేపట్టినగతిఁ గృప । ననుఁ జేపట్టెద నటంచు నాళీమణిని
న్నని వెనొ? తనమదినీగతి । నని చెనొ? సరసత్వమునుర నాళీశవరా! 99

కం॥ ముద్దియ నెమ్మోమనిరిను । ముద్దిడఁగాఁదలఁతు భువనమోహనముగనీ
ముద్దైంతదాచుకొనియెదు । తద్దయు నామోదగరిమఁదనరియుఁ దమ్మీ! 100

చం॥ అలవడ మామకోదరగతాభిమతస్పృహ నీకు సర్వమున్
దెలిపితిఁ గాన మోహనగతిం బ్రమదాప్రతిమా స్తభూతి సం
థిల నను నూరడింపఁ జనుదెంచితొ? పద్మకులప్రదీప నా
తలఁపునరిన్ను నేఁడొకనిధానముగాఁ దిలకింపఁజెల్లదే? 101

కం॥ నేమమె సింధుసుతకుఁ? బరి ణామమె తత్ప్రియసఖులకు నవ్యతదీయా
రామ లతికలకు భద్రమె? తామరసలలామ! శోభితశ్రీధామా! 102

తే॥ తలఁప మధుసూదనమనోరథంబుఁదీర్ప । నీవ నేర్పరివను టెల్ల నిక్కమయ్యె
నమితసౌజన్య! కమలాకరైకమాన్య । యబ్జమూర్ధన్య! చక్రరథైకధన్య!” 103

మ॥ అని యెంతేముదమంది తత్ప్రియవయస్యారత్నముం జూడ నా
వనజాతాయతనేత్రి యిట్లనియె “దేవా ధావభూబాణపా
తవసంవర్ధితదేహతాపయగు పద్మాకాంతచింతామనో
మననం బేమనివిన్నవింతు నతివాఙ్మర్యాద చూపట్టఁగన్ 104

సీ॥ అనుజుఁడై నశశాంకుఁ డపకారియైలోఁచె దుండగంబునఁ గళాదుండు గాన
నంగజుండు తనూజుఁడయ్యుఁ దాపముఁజూపె వివరింప నుగ్రవిద్వేషి గానఁ
బ్రాణపదంబయ్యుఁ బవనుండు తల్లడింపఁగఁజేసెఁ గదుఁ బ్రకంపనుఁడు గానఁ
గమలముల్ క్రీడాస్పదములయ్యు మొనసూపె దళములు కాండజాతములు గాన
విశ్వమందిర యిందిర వివిధగతుల । వారిచేనిట్లుమదిఁ గ్రాఁగి వగల వ్రేఁగి
“విరహశిఖినాపఁగరమె యేకరణి నైన నే? । నీకరుణలేక” యంచుఁ గన్నీరునించు

సీ॥ "అఖిలలోకాలోకనిర్మాతుఁడగువాఁడు తేరికన్గొనఁడె నాదీనవృత్తి?
జగదశేషార్తి ప్రశమనాత్ముఁడైనవాఁ డాపలేఁడెమదీయతాపభరము?
సకలప్రపంచార్థసంవేదియగువాఁడు తెలియఁడే నామదితలఁపుకోలఁది?
అఖిలేష్టదాయకుండగువాఁడొసంగఁడే దూరింప కస్మన్మనోరథంబు
తామరసనాభుఁడన్నిఁట దక్షుఁడయ్యుఁ । జిత్తమున నేను నన్నుపేక్షించుటకును
గారణంబేమి"యనుచునాకలిమికొమ్మ । నెమ్మదిని సంచలించుఁ గన్నీరునించు 106

చం॥ "గరుడరథాధిరూఢునకుఁ గన్నులుమీరలుగాన నోసుధా
కర రవులార! లేఁబగలుకాంచినవారలు మామకీనదు
స్తరవిరహంబు నీరగయునఁ జక్కికినిం దయఁబుట్టునట్లు తె
ల్పరె" యనివెచ్చనూర్చుఁ గమలాసతి నీపయి ప్రేమ నచ్యుతా! 107

తే॥ ఉదధసుతచేతఁ దగు నీమహోత్పలంబు । తలఁప నీలోత్పలంబయ్యెఁ దాపశిఖిని
గన్నె నీలోత్పలశ్యామునిన్నుఁగూర్పి । యదియె కానుకఁబంపె నిజార్తిదెలుప

వ॥ అదియునుం గాక 109

చ॥ మతిమతి నంటినంటి తనమాతనమాటలఁ జిల్కఁజిల్క స
ద్గతిగతి నెమ్మినెమ్మి గలదాగలదా శయనిందునిందు నా
కృతికృతి నాపనాప గరకేగరకే దనిమిన్నమిన్న యై
రతిరతి రాయలాయ నిదురానిదురా కనుదారదారయన్ 110

కం॥ ఆ కానఁదడయ కానా । శ్రీకాననఁ దేల్చు సరసలీలన్ గుసుమో
త్సేకయుతానేకలతా । నీకవృతారామసీమ నిపుణత"ననినన్ 111

శా॥ ఆమోదంబును జెందినందకధరుం డానెచ్చెలింబల్కె "నో
భామారత్నమ! యీప్రయత్న మనుసంభావించి యస్మన్మనః
ప్రేమావేశము లట్టివేకద ప్రియాభి"ప్రాయమున్ నీవచ
స్సామర్థ్యంబున నంతయుం దెలిసె నీసంకల్పమీడేఁర్చఁగన్ 112

మ॥ గరిమన్ రేపె చతుర్ముఖప్రముఖలేఖశ్రేణి రావించి సా
గరరాజున్ శుభలీలఁ గన్యవడుగం గాఁ బంచి కల్యాణవే
ళ్కరి పెంపొందఁ బరిగ్రహింతు నిదినిక్కం బంచు నయ్యిందిరా
తరుణీరత్నముతోడఁ దెల్పి మది సంతాపంబుఁదీర్పంగదే 113

కం॥ అనితామరసదళాక్షుఁడు । జనితానందమునగుణతోఁ బెంగ నుంగరమున్
వనితామణి చేతికి జ । వ్వని తానదిగోనుచు నుత్సవంబున మరలెన్ 114

శా॥ ఈరీతిం జెలికంపి యయ్యెడల నాయిందీవరశ్యాముఁ డా
నీరేజాస్యవయస్యయున్ మగుడియున్నిద్రత్వరాముద్రతో
శ్రీరామామణిఁ జేరి సారకిరణశ్రీభద్రికన్ ముద్రికన్
సారప్రీతినొసంగి యచ్చటి క్రియాసారస్యముల్ దెల్పుచున్ 115

ఆ॥ పోయివచ్చినచెలిఁ గౌఁగిఁ బొసఁగ నుల్ల । మలరఁబట్టుచు నిబ్భంగి నాశుభాంగి
పూర్వగ్రహచ్ఛిన్నచందానఁ బోలెఁ దీటోన । తెలుప రత్నాకరకుమారి చెలువుమీఱె

చం॥ ముదమున నంగరమ్ముఁ గొని మ్రొక్కుచుఁ గన్నుల నొత్తి సారెఁ బే
ర్కొనపయినుంచి “నిన్ను జగదీశ్వరుఁ డెంచెఁగదా ముదాప్తి నా
మదిఁ బరితాపమార్పుటకు మక్కువతో” నని యూరటన్ రమా
సుదతి చెలంగె నంతనటఁ జూడఁదగెన్ శశి ధూసరద్యుతిన్ 117

మ॥ ఉదయంబందుచు నంబుజాసనతనూజోష్ణన్ సువర్ణద్యుతిన్
బిసపన్ సోముఁడు గాన శోభనరుచుల్ పెంపొందు నామీఁదటన్
దుదగట్టుండ సితేతరాంగుఁడగుచుం దోఁచెన్ విధుండోటఁ ద
ప్పదు మూర్తిత్రితయాఖ్యఁ జొనసఁగం బద్మారి ప్రత్యగ్దిశన్ 118

చం॥ మనసిజు చర్యయందుఁ జరమక్ష్మితిభర్తవినందదాజ్ఞ చే
వనుకలవార్తలెల్లసమయంపుముఖాదిలిఖించి పంపు నా
దినచరికమ్మ ముద్రపగిదిం దగె వేగుఁ జందమామ వ
ర్ణనమొనరింప మధ్యవివరంబనఁ దోఁచెఁ గళంకమత్తఱిన్ 119

ఉ॥ వేగవతూపుచే సమయు వీరరఘూద్వహుఁ డిందు వాలియు
ద్రేకము మాన్పఁ దజ్జయపరిగ్రహ కాంత నభోంతరార్కజున్
గ్గైకొనవచ్చెఁ దారయనఁ గాంచఁ దగెన్ దూర్పున వేగుచుక్క ని
ర్వ్యాకుల తత్ప్రజాకలకలార్థ్నటినాఁ దగెఁ గుక్కుటధ్వనుల్ 120

తే॥ ఘనతరస్నేహకలనప్రకార మొంది । తమములణఁపు చునిజతపోధర్మమునను
బూర్ణసత్త్వగుణస్ఫూర్తిఁ బొరసెననఁగ । నమరె నవఘోతరుచుల దీపాంకురములు

చం॥ అలరెను వేగుచుక్క విశదాస్యముగా నరుణోదయంపుడాల్
గళకుల టెక్కులార్పుచుఁ జెలంగెడి ప్రాగ్గిరిపక్షిరాజుఁ బెం
పలరఁగఁ గాంచి భీతి నెరయంగ నధోగతికిం దొరంగు నుం
డలితభుజంగపుంగవుఁడనన్ శశి గ్రుంకె నిరంకుశత్వరన్ 122

శా॥ ప్రాజ్యంబైనయనంతరాజ్యపదవిన్ భోగేచ్ఛ నున్మత్తుఁడై
సజ్జ్యోతిశ్ఛిదఁ జేసి రాజు తుద నస్తంబంది దోషాపరి
త్యాజ్యస్ఫూర్తి నధోగతింబడియె నుద్యత్కాలధర్మాత్ముఁడై
"రాజ్యాంతే నరకం ధ్రువం" బను బుధప్రాప్తోక్తి తథ్యంబిలన్ 123

కం॥ జాతరతిశ్రమ కాముక । జాతతనుజ్ఞాని ప్రాని సడలించె సరో
జాతసుగంధపరీత । ప్రాతర్వాతూలజాల పటుచంక్రమముల్ 124

ఉ॥ తారలుదారె జారె హిమధాముఁడు కాముఁడు పాంథసుర్థన
క్రూరత మానెఁ బూనె గహిఁ గోకము ఘూకము లాత్మసంభ్రమో
దారతవీడె వాడెఁ గుముదప్రసవంబు దమ్ములు సంగళాంగశృం
గారమునందె డిందె మదగర్వగుణ సర్వము చంద్రికాళికిన్ 125

తే॥ అంతఁ బద్మాసన ప్రశేయాంతరమున । వరుణరుచిపూర తేజోమయాబ్ధి పొంగ
హరివసించుట కటఁ బోల్చు నలఘువృత్తి । కనకవటపత్రమనఁ జండకరుఁడు వొడిచె

ఉ॥ విప్పగుతమ్మికసందనల వేడుక నర్కకరప్రభాంగనల్
పుష్పడిరాజనాలు నలపుల్ పెడఁ జల్లఁగనించి సారెఁ జాల్
దప్పిదంచ నెత్తము సలచ్చటలోయనఁ జూడవింతయై
యొప్పెఁ దదంతరాళపతదుత్పతదుద్ధతషట్పదావళుల్ 127

మ॥ ఆదికారప్రతిభా! కృపారసప్రవృత్తాపాంగ! తాపాంగనా
ద్యుపతిప్రార్థితసువ్రతాంగకృతసాంగోపాంగ! గోపాంగనా
ర్జవసౌందర్యముఖాబ్జలోలుపమనస్సారంగ! సారంగ బం
ధవిముక్తిప్రథితత్వరా! విలసదద్వామాంగవామాంగజా! 128

చక్రబంధము

శా॥ సత్యారక్త! భవేంద్రవందితపదాబ్జా! శ్రీశుభ్రైలాశనీ!
సత్యామానితకల్పకవ్రతపురస్థాయుజ్జ్వభానస్థలీ!
నిత్యానిష్కపటేహభంగతతబాణ్ణాశస్వభీముగ్ధనీ!
నిత్యావాసవిలాస! గాననిపుణా! నీలాంగ! నీలాక్షినీ! 129

కం॥ బృందావనవిహరణ! గో । బృందావననిపుణ! పుషితబృందారక! పౌ
రందరమణిరుచికందర । మందరధర భక్తఫలదమందారనగా! 130

గద్య. ఇది శ్రీరాఘుసము వెంకటపతిమంత్రివర్య ప్రణీతంబైన లక్ష్మీవిలాసంబను
మహాప్రబంధంబునందుఁ జతుర్థాశ్వాసము.



# లక్ష్మీవిలాసము

## పంచమాశ్వాసము

కం॥ శ్రీవనితాకుచకుంభ । ప్రోచ్ఛితమృగనాభిసౌరభాస్తోకమనో
భావుక! శుభదాయక! శ్రీ । తావిపులకటాక్ష! వెంకటనగాధ్యక్షా! 1

వ॥ అవధరింపుము తరువాతివృత్తాంతంబు జనమేజయునకు వైశంపాయనుండిట్లని యె
దసనంతరంబున 2

మ॥ ఘనజాహాన యథోచితక్రియలు నిర్వర్తించి వైవాహికాం
గనసంరంభనిరీక్షణోత్సవము నాకాంక్షింపుచున్నంత మే
సునిభాగం బటము న్నెయుక్తసరణిం గాల్యక్రియల్ తీర్చి శో
భన సంపాదకమందహాస మిగురింపన్ సొంపు వాటింపుచున్ 3

సీ॥ జిగదేర వగమీఱు దగ నొరసిగవేస సరవాలుగ రుమాలు సంఘటించి
నలువొందు మనుకుందనపుగండె మెడఁబూసి నెమిగిఁ బొలెనుప్పాణికొంట్లు దాల్చి
సిగభట్టు మగువట్టు యరచట్టుసవరించి జరహేంళిరుచిఁ జాళి సఱుతనుంచి
గహింఁజూపు మణినూపురముఁ గ్రుపునధరించి కటిసీమఁ బటుహేమపటముఁగట్టి
పొసఁగనీభంగి శృంగారముల నెసంగి । భాసమానాగ్రరత్నసంహాసనమున
నంతఁగొలువున్న నిజదేహకాంతివిజిత । వనధరుండగు నాసుదర్శనధరుండు 4

ఉ॥ జిబ్బ మెఱుంగుచల్లులు విచిత్రగతిం దొడిఁ బెన్మొఖామహో
జిబ్బిలు నేళఁ గాంచి హరిసేవకురా సమయంబటంచుఁ జె
పబ్బటుచీట్టు వ్రాసి నిజభర్తలపాలికిఁ బంచి రంత లో
నబ్బలిబంధనుండును భవాబ్జభవాదులఁ బిల్వఁబంచినన్ 5

సీ॥ తన పురాలోకంబు తనపురాలోకంబు చెలువున ముక్తవాంఛితము గాఁగఁ
దన విగ్రహస్ఫూర్తి తనవిగ్రహస్ఫూర్తి పగిది నక్షుఃశర ప్రతిభ నమరఁ
దన సామభాషలు తనసామభాషల తెఱఁగున ననురాగపరతఁ జూపఁ
దన సుధర్మామహాశ్రీ తనసుధర్మామహాగతి సాధులోకసంభృతి నెసంగ
నలినగర్భుండు నగధన్వి నారదుండు నముచదమనుండు వచ్చి రానగరమునకు
బరమపుణ్యులు ప్రమథులాపన్నతాదియాతులు పావకముఖ్యదిక్పతులుగొలువ

చం॥ రయమున నిల్చిరా నవసరంబులవా రెదురేగి కొల్వునే
శ యనుచుఁ దెల్పి యుక్తవిధులన్ సముఖంబునఁ జేరి కానుకల్
శయములఁ గూర్చి నమ్రులయి చక్రధరుం బొడఁగాంచి యంచిత
ప్రియములు నర్ఘ్యపీఠముల శ్రీకరలీల నొసంగి రర్థితోన్ 7

కం॥ దారసిపనాత్మ నెంతయుఁ। దారసిలవిలోలవృత్తిఁ దనుహరిపుత్ర్యాదియుం
బారసి సారసభోగ్యలి। వారస లేఖాపతులు లనిరి ప్రస్తుతిన్ 8

సీ॥ బాడబాశాపూర్తి పరజీవనము వాఁడు భూరిసత్త్వగుణప్రస్ఫూర్తి వాఁడు
ప్రతికళోత్కలికా పరంపరాయుతి వాఁడు పంకంబు నంటఁగ బలిమి వాఁడు
సరసోత్తరగభీరశబ్దసంగతి వాఁడు బహువాహినీశక్తిబలము వాఁడు
తతభూమిభృత్కులాధారపద్ధతి వాఁడు ద్వి(జరాజజనితవృత్తి దిరుగు)వాఁడు
దీయమానోర్జిత)వృతతాన్నధేనురత్న। సాయకగాంధీశతోషితస్వాంతవిబుధ
వరకృతాశీర్వచనపరివర్ధమాన। కీర్తియుప్పొంగువాఁడు లక్ష్మీగురుండు 9

తే॥ తేజమున మీఁకు నాత్మతనూజ నొసఁగి। ధన్యుఁడగుఁగాక వాంఛితార్థములఁ బొసఁగి
కన్యకాగ్రకొమ్ము పరిణాములన నొసఁగి। తపసివరొందద మే మన్నుతంబు మెసఁగి

కం॥ కల్యాణాంగ్న మొక్కటి। కల్యాణాకార్యధైర్య! కల దీ రజనిన్
గల్యాణవాగుచితసా। కల్యక్తై కొను వివాహకౌతూహలమున్" 11

కం॥ అనవినిహితసంగతి నొ। య్యన వినిహితచిత్తుఁడగుచు నాహరి లోకా
వనవిధి యోగుణనిధులన్। "వననిధి కేతన్త్రహర్షవముఁ దెల్పుఁ"డనన్ 12

కం॥ హరియానతి నతినుతుఁడా। దరమున శిరమున వహించి తామరసభవుం
డురుగతి వరయతి సురతతు। లరుదేర నదీరమణు గృహంబున కరిగెన్ 13

చం॥ అతఁ డెదురేగి వారల గృహాంతరసీమకుఁ దెచ్చి రత్నరా
జితకనకాసనంబుల వసింపఁగఁ జేసి వినమ్రుఁడై యథో
చిత వివిధోపచారములఁ జెల్వుగఁ బ్రముదులఁ జేయ నాయెడన్
గుతుకముతో సరిత్పతిని గూర్చి సరోరుహగర్భుఁ డిట్లనెన్ 14

శా॥ "శ్రీరత్నాకర నీకుమారిక నకుంఠోదారికిన్ శౌరికిన్
సారోదారికి చారగా నొసఁగ నుత్సాహించు నీవాంఛ యీ
డేఱున్ వేడుకఁ దచ్ఛుభాచరణపాండిత్యంబుఁ బూనందగున్
సారంబైనముహూర్త మీనిశఁ బ్రశంసస్ఫూర్తిచే నొప్పెడిన్ 15

సీ॥ పంకజబంధుసౌభాగ్యంబు పదములఁ దారకావరసఖత్వము నఖముల
శారిమంగళ మైత్రి జంఘల బుధసుతాభోగసంరంభానుభూతి తొడల
గురుసుదర్శనయోగ్యకుశలత కటిసీమఁ గవివర్ణనీయసాంగత కుచముల
సారకళామోదసంపద మోమున బాహుసౌహార్ద విభ్రమము వేణి
ననఘకేతునమ్రగశోభనత మేనఁ । దగవరానుగ్రహరుచి నీతనయ దనరెఁ
జ్రేయుచు దత్పరిగ్రహాసక్తినొనరె । జలధవర నేఁడు పరిణయోత్సవమునడపు 16

కం॥ అని విధి దాఁ గర్ణరసా । యనవిధిగా నిటులఁ బరిణయారంభవినూ
తనసాగరవనజోదర । ఘనమోదరసంబు తేటగాఁ దెల్పుటయున్ 17

మ॥ పరమానందమునన్ వదీశుఁడనియెం బ్రౌఢోక్తి "నో భారతీ
శ్వర! కన్యాబ్ధిచతుర్భుజుండఁట సుశోదారుల్ భవన్ముఖ్యని
ర్జరవర్యుల్ మతి పెండ్లిపెద్దలఁట యీసౌభాగ్య మన్యుక్తిపః
పరిపాకంబఁట యింతకన్నఁ గలదే భాగ్యేహ యూహింపఁగన్ 18

కం॥ వినవచ్చు నేస్వతంత్రుం । డనె హరికిన్ విన్నవించి నడపుఁ డుచితవ
ర్తనములు "కర్త్రాభోక్తా । జనార్దన"యనెడి సఫలతఁ జెందన్" 19

కం॥ అనియుక్తరీతిఁ దనహృద । యనియుక్తినునీతిఁ దెల్పి యంగీకారం
బున రుచిరాన్వితి వారికిఁ । బునరుచితాపచితి సల్పఁ బూన్నోత్సవులై 20

మ॥ విహగస్యందన పాలికేగి యటుఁ గన్యాప్రాప్తి మత్యుత్సవా
వహసూక్తిన్ వినిపింప నెమ్మది నఖర్వప్రీతి నంతించె న
మ్మహిళామన్మథుపంపు వంబుగము సంపత్పూర్ణకల్యాణ నం
దహలీలంగయి సేయఁగాఁ బనిచె సైన్యస్వామి చిత్రంబుగాన్ 21

సీ॥ మెఱుఁగుజవ్వాదితో మేళవించిన మంచికుంకుమరసచర్చ కుదురుకొల్పి
గొజ్జంగపన్నీరుగూర్చిన ముత్యంపుసన్నసున్నంబులు సంఘటించి
సరసరీతి శిలారసంబుతో మెదిచిన పచ్చికస్తురిచాదుపట్టెలునిచి
ఘనసీరుకలువపుష్పాళి స్ఫురింపించి సునుపుమీఁఅంగఁ గల్పనముఁ జల్లి
పగటుముత్యాలముగ్గులు పచ్చతోర । ణములు బంగారునవరత్నకంబములు నగరు
ధూపములు రత్నదీపంబు లేపుమిగుల । వలఘుశృంగార మొనరించి రప్పురమున

శా॥ మిన్నాబంగరుకాగితంబులను గాశ్మీరంబుచేఁ జిల్కియున్
వన్నెల్గా శుభలేఖ లెల్లెడలకున్ వ్రాయించి యాపై సిరుల్
చెన్నారన్ విలసత్సుదర్శనశిఖాచిహ్నంబులొత్తించి భా
స్వన్నీలన్ భువనాధినాయకులఁబిల్వంబంచి రంచద్గతిన్ 23

వ॥ ఆసమయంబున 24

మ॥ బహురాజ్యావసపట్టబంధములు గాశ్రావించి శీఘ్రంబునన్
రహి నాలేఖలుదాల్చి లేఖపరివారంబుల్ సదారంబులై
మహనీయాదృతిరాఁగ సైన్యపతి సన్మానంబుతోడన్ శు
భావహాలీలన్ విడియించె వారలను జాళ్వా బల్బిడారంబులన్ 25

తే॥ సింధుకన్యకఁబరిణయంబ్రీతిదలిర్ప। వేడ్కతోఁ బెండ్లికూఁతుఁ గావింపఁటకును
మంచివేళని సప్తార్చిమానవతులు। దెల్పఁ దచ్ఛుభారంభ సందీప్తులగుచు 26

మ॥ వికసన్మౌక్తికరంగవల్లికలతీవిన్ మించు కల్యాణవే
దికపైఁ బచ్చలపీఠనంబునిడి పూర్తింజేర్చి యాకల్మిప్రో
డకు దీవింపుచు నక్షతంబులిడి పాటల్ పాడుచున్ భవ్యవా
క్ప్రకృతిన్ నల్గులు వెట్టి రిందువదనల్ కాశ్మీరచూర్ణంబునన్ 27

తే॥ శంఖభేరిమృదంగాదిసకలవాద్య నినదములు నర్థివీచికానినదములును
గూడి యామ్రేడితంబులై కూర్మినపుడు విశ్వమందుట కెదురుకోల్విధమునడపె 28

కం॥ కరపుటపటుఅయాగతి మేనరమరవహియింప నఖముఖాపాదితచా
తురి సంపెంగనూనియచే శిరసంటెన్ వాణిసిరికిఁ జిత్తముగదురన్ 29

మ॥ బిగిచన్నుంగవరాయ హారకలికల్ పెంపిల్లగూయన్ నవీ
నగతిన్ మోము చెమర్ప దృష్టువిరిదండల్గూర్ప నూర్పుల్లగన్
మగుడింపన్ మణికంకణక్వణనసన్నాహంబు రాణింప సం
పెఁగనూనెన్ శిరసంటె వాగ్రమణి లక్ష్మీకాంతకున్ వింతఁగన్ 30

శా॥ శీవిన్ వాణి సరోజవాసిశిరసంటెన్ సత్తతాశ్రప్రభే
దావల్లద్గతి యంబకస్ఫురణ పెంపారన్ బదఘ్నాక్తి సు
గ్రీవోత్తానకళాస్తిఁ దెల్ప నుకరక్రీడాధృతస్నేహమా
సావిన్ రామకథాప్రసంగరుచిమించన్ సొంపువాటింపనన్ 31

మ॥ కరజాపాదితరాగలై పులకరేఖావిస్ఫురద్గండలై
నిరపాయామృతపారవశ్యముకుళన్నేత్రాబ్జలై చారుని
స్స్వరదుచ్ఛ్వాసవిలాసలై విలులితాంచత్కేశలై సత్కళా
నిరతిం దారతిసౌఖ్యమంద శిరసంపన్ వాణి కల్యాణికిన్ 32

వ॥ తదనంతరంబ 33

కం॥ ఇంతులు గంధపుటటకలి । కాంతకునిడి పెదుపనిగుడెఁగచములనురపుల్
కాంతగతి విధుంతుదవద । నాంతరనిష్క్రాంత తతసుధాంశువెపోలెన్ 34

మ॥ హరికింబట్టపురాణివివయని కల్యాణైకవాక్యస్థితుల్
పరఁగం బుణ్యనదీనదోదకములం బట్టాభిషేకంబుఁ జే
సి రసానుజ్వలహైమకుంభముల చేఁజేతన్ సుగంధాంబువుల్
హరిమధ్యల్ తగనించి నించి జలకంబాడించి రబ్జాలయన్ 35

కం॥ శిరసుతడియొత్తి మపటపు । నెతిసెల్లాఁగట్టి వారినిలయము వెడలెన్
శరధినుత గంధపహారతి । శరధివినిర్గతలతాంతశరధగ్గరిమన్ 36

మ॥ ఘనవర్షాత్యయమానసాశ్రయవినిష్క్రాంతశ్రియామేయమో
హన కేళీకలహంస్యలీలఁదగ నీరాగారముంబాసి వా
రిని ఫీశాత్మజ నీలమంజులవితర్దిన్ విశ్రమించెన్ ముకుం
దునిబాహాంతరవేది నీగతివసింతున్ వేడ్క నన్నట్లుగన్ 37

వ॥ తదనంతరంబున 38

తే॥ శిరసునీరార్చి పెన్నెఱుల్ చిక్కు దీర్చి । నున్నఁగాదువ్విజడవేసెఁ గన్నెయొకతె
బాలచెలువొందె నవభృంగమాలికాను । గత లతాంత లతాపరిష్కారమమర 39

కం॥ చంపకగంధియొకతెదా । సంపల్లలితాంగిజడను జాతుర్యమునన్
సంపెంగపూలుచుట్టెను । శంపాధృతజలజరేఖ చందముదెగడన్ 40

శా॥ భూతిద్యోతకరూపలక్షణయుతంబుల్ శ్రీకరాలోకవి
ఖ్యాతంబుల్ సుగుణాన్వితంబులు విధూతాఘంబు లీరత్నముల్
నీతోఁబుట్టువులంచు దన్మణిగణోన్మేషైకభూషావళుల్
చేతఃప్రీతిఁదనూజవల్లియొసగెం జేకొన్కఁగాన త్తతిన్ 41

కం॥ అంబరమణి కాంతస్థగి । తాంబరమణి యొకటితెచ్చి యతఁడిట్లనెఁ దో
యంబరమణి కైకొనుమీ । యంబరమణి మీదనంప దాస్పద మరయన్ 42

తే॥ ప్రౌఢిసకలార్థగోచరప్రతిభ నంద, మైనరుచిఁ గాంచి శబ్దగ్రహణగుణ్య
కారకానూనవైచిత్రిఁ దనరుకతన, నబ్జపత్రనేత్ర యిది నేత్రమనఁగఁ బరఁగె 43

మ॥ అకలంకప్రతిభాభిరామ మనుగుణ్యానంతరత్నప్రభా
వికలం బక్షయరూపవిభ్రమ మహావిష్కారదోషం బఖం
డకళామండితబంధురం బహహా వేద్యం బిత్ర మీయర్జునాం
శుకనైసర్గికముగ్ధడింపః దరమే సుత్రామరత్నాలకా 44

కం॥ సరసతటిత్పద్మాంకము వరపుష్పవదుదయరాగవర్ణితము సదా
దరణీయగంధవహాభా స్వర మీయంబరము దివ్యజనపదము సుమీ 45

ఉ॥ అచ్యుతనంబుజోదరభుజాంతరమందన పాయమై యబాం
డచ్యుటలీతకాంచలవిడంబము నక్ స్వజియింపఁ జాలు నా
వ్యాచ్ఛుభలీల నిశ్చలసుభాయతి చేఁ జెలువొందె దీనువ
స్త్రచ్ఛదముల్ ధరించి చరణస్ఫురణాధరితాబ్జవిభ్రమా 46

మ॥ ముదితల్ నోములు నోచు నైనువతనంబుల్ నిస్తులాపత్స సం
పదయుల్ సర్వజగచ్ఛరణ్యమహామోహపన్యాసి సల్లక్షణా
స్పదసౌభాగ్యముఁ గల్గియుప్పమనుచుల్ ప్రౌఢోక్తి నా హైమ చి
త్రదుకూలంబొసఁగెం దనూజకు సరిత్కాంతుండు దీపింపుచుల్ 7

శా॥ చిత్రాంబరభూషణావళు లమందానందనిష్యంది ద్ర
వ్యాచర్యం బెనఁగం గ్రహించెఁ గమలాకల్యాణయోచిత్యముల్
భూచక్రంబున నట్టి దేకదసతుల్ పుట్టింటివారిచ్చు సం
కోచాలంకృతమైన గౌరవముఁ జేకోఁ జాతు రిచ్ఛారతిన్ 48

కం॥ శ్రీలెసఁగు హేమవసనం। బాలేమ ధరించెనవ్వు డధోంచల విలస
న్నీలావళి చరణాబ్జమ। దాలనటాదళివరాళి యందముఁ దెలుపన్ 49

తే॥ సుముఖశశిపార్శ్వ (సంస్థిత) విమలతార, కాగణములనము త్తైలకమ్మలమర
నతివకుతుకంబుఁ దాల్చెఁ దదంతికస్థ, పరిధిరేఖార్థ శృంగారభావముమరి 50

కం॥ మేలగుసాపటబొట్టా, బాలికసీమంతసీమఁ బాటింపఁదగెన్
నీలాభ్రమండలాంతర, ఖేలత్కుముదాప్తదీప్తకిరణము వోలెన్ 51

కం॥ దోషాకరుచెనసినసిరి, దోషాకృతిఁ దోలఁగఁదలఁచు రోషీణి వోలెన్
యోషామణి నానామణి, భూషామణిలములవొందు పాలు పొందలఁపన్ 5

భూతిపుగ విషయముగనుపించదు. బ్రాహ్మణులు నిష్పక్షపాతముగ వేదశాస్త్రంబులు క్షత్రియాదులకు బోధించిరి. పాండవులకు కౌరవులకు ధనుర్వేదాదిసకలవిద్య లుపదేశించిన ద్రోణకృపాచార్యులు బ్రాహ్మణులేను. శ్రీవిశ్వామిత్రునకు జృంభకాస్త్రాదిక ముపదేశించిన కుశాశ్వుడు బ్రాహ్మణుండేగదా. క్షత్రియుండగు సురథునకు వైశ్యుండగు సమాధియను వానికి శ్రీచండికాదేవి యారాధన విధానము దెలిపిన సుమేధుండు బ్రాహ్మణుండేను. ఇటులనే యనేకవిషయంబులందు పురాణశాస్త్రంబులు శూద్రులకును దెలిపిరి. శూద్రులకు అధ్యయనాదినిషేధము కేవలము వేదమాత్రవిషయము. వేదాధ్యయన ముపనీతునకు మాత్రమేయగుటయు- శూద్రునకుపనయనాధికారములేదని ప్రత్యక్షవేదమున గనంబడుచుండుటచేత శూద్రులకు వేదాధ్యయనాధికారము మాత్రములేదు, అయినను వీరికి పురాణశ్రవణాదికమందధికారములేకపోలేదు ఎందుల బ్రాహ్మణులకు నిత్యకర్మలగు జపహోమాదులు పంచయజ్ఞంబులు మొదలగునవి గలవో యటులనే శూద్రులకును నిత్యకర్మలగు, పంచయజ్ఞములు, గార్హస్థ్యము, హోమాదికమును గలవు. కేవలము వీరికి శ్రుతియందుమాత్ర మధికారములేదు. శూద్రులకు వేదాధ్యయనమువలన విశేషముగ నందదగిన ఫలవిశేషమేమియుం గనంబడదు పురాణశ్రవణాదికము చేతనే సర్వము సమకూరుచుండగా శ్రుతియందు నిషేధించిన వేదాధ్యయనము కోరుటవలన లాభమేమి? వీరు స్వవర్ణమునకు నియమితములగు వృత్తులయందు నెవ్వరులు కాంపోలేదు. వారివారి వర్ణములకు నియమితములగు వృత్తులనుగూర్చిన యంశంబులను వారికి బోధించక వారిని నజ్ఞానసముద్రమునం బడద్రోయలేదు ఇక నేమన త్త్రైలోలది వారివార్తికిం దగినవృత్తులుండగు మిం... స్వరులట్టి నటులనేమొనర్చిరి. బ్రాహ్మణాదివర్ణత్రయ సేవయే శూద్రులకు ప్రధానకర్మయని స్మృతులయందు వచించినంత మాత్రముచేతనే "శూద్రుల బ్రాహ్మణులు అజ్ఞానగర్తమునం బడద్రోసి స్వగౌరవమును జూచుకొనిరి," అనియన సాహసింపం జనదు. సేవయనంగా అంట్లుతప్పెలల తోముటయు, కాళ్లు పిసుకుటయు, తలంటుటయు, ఇల్లువాకిలి మొదలగువానిని గోమయాదికంబుచే నలుకుచు నీళ్ళుచల్లుచు ముగ్గులు పెట్టుటయు, కట్టెలు మొదలగునవి కొట్టుటయు, వడ్లు, దంచుటయు మొదలగు హీనకృత్యములు మాత్రమేయని చెప్పవలనుపడదు. ఇక సేవయనంగా ఇంతయని మితిపెట్టంబడిన మాసవేతనంబులనో లేక దినవేతనంబులనో నియమితముగ గ్రహించుచు పరుల పనులు చేయుటయు సేవయనియే శాస్త్రములయందు ప్రాచీనులు వక్కాణించియున్నారు. నాగరికముగల దేశములోని వారలంకరించువిషయమయి ఏకాభిప్రాయము గలవారయియున్నారు. గాన మన భరతవర్షవాసులగు సోదరులును దీనిసయు మెఱింగియే యుందురు, ఈప్రకారము వారివారి సామర్థ్యము

ననుసరించి వారలకు ద్రవ్యమిచ్చుచు, వారివలన తగినపనులు చేయించుకొనుచు, వారును తామును సౌఖ్యమనుభవించుట చిరకాలమునుండి సంప్రదాయముగానున్నది. ఈ పనిచేసినవారల చూచి వీరు వారిని మిగుల హీనులనుగా చూచిరనియు, వారిని క్రిందికి నణంగద్రొక్కిరనియు, అజ్ఞానులనుగ చేసిరనియు, స్వగౌరవమునే చూచికొనిరనియూ, మఱియు పరిపరివిధంబుల తమకు తోఁచిన యుక్తులను వచనంబులను జడివానగా గురిపించి ప్రాచీనుల నిందించుట న్యాయము కాదు. "శాస్త్రరహితంబును ప్రమాణవిరహితంబునునగు యుక్తియే తమకు శరణం" అనితలంచు మహానుభావులు మాత్రమే యటులఁ బలికిన తగియుండును. కాని "దూరాలోచనయు సద్వ్యాసంగమునందు మాత్రమే దృష్టియుఁగలిగి యటుల మేము సంచరింతుముగాని తద్విరోధంబుగ నాటంతయైనను సంచరింపము" అని వచించు మానవ్యాసోపరులనఁ దగిన వచన విధము కాదు. పైనఁజెప్పిన తీరున సేవఁజేయించుకొనుటయు నింద్యమని చెప్పఁదలంచిన యెడల నటుల నొనర్చు శ్రీరమేశచంద్రదత్తు, రానడే, సురేంద్రనాథబనర్జి, గోపాలకృష్ణగోఖలే మొదలగు హిందూదేశీయులును, మింటో, కిచ్చినరు, మోర్లే మొదలగు పాశ్చాత్యదేశీయులును, ప్రకృతమున శ్రీ ఎడ్వర్డు చక్రవర్తిచేత అణఁగద్రొక్కఁబడిరనియు, హీనులుగాఁ జూడఁబడిరనియు, మనము తలంచవలయునుగదా. ఇట్టిమాట ఇదివఱకెవ్వరును చెప్పియుండలేదు. ఇప్పుడును జెప్పుటలేదు. ఇకమీఁదనైనను జెప్పరు. లేక ఎవ్వఁడైన చెప్పినను సత్యమేయని అంగీకరింపరు. ఎక్కడికో పోవవలెనందుకు? మానవ్యాసోపరులు మాత్ర మంగీకరింతురా? పైన చెప్పినవారందఱు ఎడ్వర్డు చక్రవర్తిగారికి సేవయేగదా చేయుచున్నారు. ఇటులఁ దమకు సేవచేయు "రమేశచంద్రదత్తు" మొదలగువారల చక్రవర్తిహింసచేయుటలేదు, నీచముగా చూచుటలేదు, నిందించుటలేదు. అజ్ఞానాంధకారమున త్రోయుటలేదు. కాలానుసార మొక్కొకప్పుడు వారికి సముచితాభివృద్ధియే చేయుచున్నాడు. ఇటువలెనే ద్విజాతులు శూద్రులనుండి తమకువలయు శిల్పాదినిర్మితంబుల గ్రహించుచు వారలకు అందులకు తగిన వేతనంబులనిచ్చుచు వారిని సంతోషపెట్టి దినదిన ప్రవర్ధమానుల నొనర్చిరిగాని వారల హింసించలేదు, నిందించలేదు, అణఁగద్రొక్కలేదు, అజ్ఞానాంధకారమున బడద్రోయలేదు, సేవయనగా అంట్లుతప్పెలలు శుద్ధిచేయుట మొదలగు హీనకృత్యములు మాత్రమే కావు, ఇంక నేమన పరిమితమగు వేతనము గ్రహించుచు ఇతరుల పనులుచేయుట అను విషయమునకు దృష్టాంతము చూపఁదలఁచి పైవిషయమును చెప్పియున్నాను. ప్రాచీనద్విజాతులు శూద్రులచేత ఎటుల సేవచేయించుకొనినదియు సంగ్రహంబుగ నిందు వ్రాయుచున్నాఁడను. ఈస్వల్పము చదివి యెటువంటితీరున సకలము మీరూహించుకొనవలయును. మన ప్రాచీనులు న్యాయస్థాన

ములయందు వాది ప్రతివాదులయొక్కయు సాక్షులయొక్కయు వచనంబులు మున్నగు నవి వ్రాయు లేఖకులను శూద్రులనే నియమించుచుండిరి. ఈవిషయము వంగదేశచరిత్ర గుర్తెఱింగిన వారలకు విశదమగును. వంగదేశమున కాయస్థులను నొక జాతిగలదు. వీరు శూద్రులు, ఈజాతివారలే వంగదేశమున న్యాయసభలయందు లేఖకులుగానుం డిరి. అభియోగపత్రంబులు, ఆజ్ఞాలేఖనము, మొదలగు పనులు కాయస్థులకు వృత్తి యే యనియు పలువురా దేశజనులు ఇప్పుడును తలంచుచున్నారు. ఇప్పటికిని ఆదేశ మునందు ఈవిషయము మనకు ప్రత్యక్షముగా సులువుగ తెలిసికొనుటకనువుగానుం డునని తలఁచి వంగదేశమునందలి కాయస్థులను దృష్టాంతముగా తెలిపినాఁడను. ఇటు లనే గ్రామాదాయవ్యయాదికంబును, వారివారి భూముల పరిమాణాదికంబులిఖించు గణకులను సహితము శూద్రులనేర్పరచినటుల దక్షిణదేశమగు నెల్లూరు, చెంగల్ప ట్టు మొదలగు మండలములయందు మనము సులభముగా నెఱుంగఁగలము. యుద్ధము నకుపలయిన ఆయుధములు మొదలగు సాధనంబుల నిర్మించు ఉగ్రులను జాతివారు ను, కంచుకములు మొదలగువానిని కుట్టెడు సూచికులును, నాట్యమాడునట్టువులును, పలువిధంబులగు రంగుల సంగ్రహించి మనోహరములగు చిత్తరువులు వ్రాయు ము చ్చివారును, విజయస్తంభాదికము నొనర్చు కర్మారులును, మనోహరంబులగు వసనం బుల నిర్మించు కువిందులును, ద్విజాతులకు తమతమ నైపుణ్యములఁ గనంబఱచి పరిమితవే తనంబుల నందుచు తమతమ జీవనంబు నిరాటంకముగ సాఁగించుకొనుచుండిరి. ఆ ద్వి జాతుల ప్రోత్సాహము చేతనే వేయివర్షంబులకైనను చెక్కు చెదరకుండునటుల దే వాలయంబులను మేడలను గట్టఁగలిగిన శిల్పులును, నేత్రవిలోభనంబులగు రథంబు ల నిర్మించు రథకారులును, జగంబునందంతటను వెలసి పరస్పరము తగిన సత్కా రముల నందుచు తమనైపుణ్యము చేత నీ భూలోకంబును సంపదయందును ప్రభా వమునందును స్వర్గలోకమునకు సమానంబుగ నొనర్చియుండిరి. ఈవిషయము నా నవ్యసోదరు లెఱుంగరా యేమి? తగుప్రోత్సాహమిచ్చి వారినైపుణ్యమును జగమంతయు వ్యాపింపఁజేసిన ప్రాచీనకాలపుద్విజాతులుశూద్రులనేమి యణఁగద్రొక్కిరో తెలియన లవిగాకయున్నది. ఈవిధంబున నిష్పక్షపాతముగ వారివారి వృత్తులకుభంగము కలిగింప క తగుప్రోత్సాహమిచ్చి తగినవిధముగ బోధించి, నవీనశిల్పకళల ప్రబంధమూలముగ, వృద్ధిలోనికి తెచ్చిన ప్రాచీనద్విజాతుల నిటులనిందించుటయెట్టివిధముగఁ దోఁచునో తెలి సికొనవలయును. వారిని దూషించుట క్రిందవ్రాయబోవు విషయమువలనను మూలమయి యుండవచ్చును. ఏదియనఁగా:—మనుష్యజన్మమెత్తిన తరువాత నేదియోయొక ఘన కార్యమొనర్చి పరువుప్రతిష్ఠల నందవలయునని తలంచి తగినకార్యమేమియు చేయశక్తి లేక నిష్కారణముగ బ్రాహ్మణులను తదితరజాతులను పోరుపుకలిగించునంతమాత్ర

ము చేత కృతకృత్యులమును, ఘనకార్య నిర్వాహకులమును అగుదము, అనితలంచి పైపా
దు జగమునందు మానవ్యసోదరులు వేసిరని మేము తలంచుచున్నాము నిష్పక్షపాత
ముగ విచారించిన "బ్రాహ్మణులు స్వగౌరవమాత్ర మపేక్షించి ఇతరుల నజ్ఞానాంధకా
రమున ఒడఁద్రోచి యణఁగద్రొక్కిరి" అని మానవ్యసోదరులు పలుకు వచనములు
అప్రమాణములనియు, అసత్యములనియు, నిస్సంశయముగఁ జెప్పవలయును ఈవిషయ
ము యదార్థమే చెప్పవలయునని తలఁచు ప్రతిమానవుఁడును అంగీకరించ తగినదిగా
నున్నది ఉన్న స్థితిగతులును, ప్రాచీన ద్విజాతులొనర్చిన కార్యములును, మాత్సర్యము
విడనాడి విమర్శనాపూర్వకంబుగ విచారించి బ్రాహ్మణవిహితకృత్యముల నెయ్యుడయుం
డుగల కష్టములకు భయపడి కష్టాధిక్యములేని శూద్రజాతికర్మముల నొనర్పవలయునను
తలంపు దూరముగనుంచి ఈ యభిప్రాయము వారల విచారించినచో వారికే యథార్థము
తెలియును అయిన వారలట్టితలంపు సాధారణముగ గలుగుటమాత్రమున గష్టకరమయియు
న్నది ప్రాచీనపు బ్రాహ్మణులు ఇతరజాతులకు అపకారము చేసియుండ పోవుట
యేగాక శక్తికొలఁది వీరిని యణఁగఁజేసుకొని వారలను తగిన శ్రేష్ఠకృత్యములనే స్వజా
తులకును నొనర్చిరను విషయము మాత్రము మానవ్యసోదరులు గుర్తెఱుంగుదురుగాక.

ఇటుల మేము చెప్పిన యథార్థవిషయములాలకించి మానవ్యసోదరులు బ్రాహ్మణులపైన
మరియొకవిధంబుగ దాడి వెడలుచున్నారు. — ఎటులనగా బ్రాహ్మణులు యోగ్యములగు
వంశములను మాత్రము స్వీకరించి పఠనపాఠనము, చిత్రలేఖనము నర్తనము రథనిర్మాణ
ము, మున్నగు నీచపు పనులనుమాత్రము శూద్రులకంటగట్టి వారలను వానినిబోధించిరి,
వారలు నిష్పక్షపాతమగు నభిప్రాయముగలవారలయిరేని ఆపనులనే బ్రాహ్మణులకు
నంటగట్టి శూద్రులకు వేదాధ్యయనము చెప్పియుండరా, అటులచేయక బ్రాహ్మణులకు
మాత్రము వేదాధ్యయనము చెప్పితక్కినవారలకు చిత్రలేఖనాది విషయముల బోధించుట
యే బ్రాహ్మణులు స్వగౌరవమాత్రమును గాపాడికొనిరనుటకు ప్రధానప్రమాణమని
మానవ్యసోదరులు మూరలుబారలుచూచి పలనాడుచున్నారు ఇందులకుబదులుదూ
రమాలోచించి యథార్థమైన విషయంబునే చెప్పదలచియున్నాము మీరు చెప్పిన
యంశములో "బ్రాహ్మణులు వేదాధ్యయనాదికమగు గౌరవకృత్యమును మాత్రము తాము
గ్రహించి నీచకృత్యములగు చిత్రలేఖనాదికమును శూద్రాదులకొప్పగించిరి" అనునొం
డువిషయములయియున్నవి పైపూర్వపక్షమును వేసిన మానవ్యసోదరులు పలుకఁజాడ
లఁజూడ వారలకు వేదంబులయందును, ధర్మశాస్త్రంబులయందును సరియగు విశ్వాస
ము గలిగియే యీపూర్వపక్షమును చూపిరనిమాకు తోచుచున్నది ఇట్టిపూర్వపక్షముల
కు నుత్తరమిచ్చుటయు సనాతనధర్మీయుల కొకవిధమగు నిత్యకర్మయయి యున్నది

# అపండితలక్షణము

చ॥ "నిరుపమశేముషీకలితనిర్మలచిత్త సరోజులార! యో
సరసకవీంద్రులార! బుధసత్తములార!" గుణాఢ్యులార! సా
దరముగ మాదుపల్కులను దప్పులొ యొప్పులొ యాలకింపుఁడీ!
స్థిరముగ నాంధ్రభాషఁ గవిశేఖర నామముఁ గాంచఁబూనువాఁ
డరయఁగఁ బండితోత్తముఁడునై విలసిల్లవలెన్; దెలుంగునం
దఱవముఁబోలె సంస్కృతమదంతగ రాకయొకైతనల్లఁగా
దొరకొనసాగదెందుకనఁ దొల్లిటినుండియఖండపండితో
త్తరులగువారె పోసుకవితల్ విరచించి రహించి మించనే
ర్చిరి; మఱివట్టివారడుగు చేరిరి పండితదీప్తికోర్వలే
కరయ నొకండుసేయునఁట యష్టవధానశతావధానముల్
పరునిసహాయముంగొనని ప్రజ్ఞ బయల్పడ; నాశుపద్యముల్
విరచనసేయుసంటకడు వింతఁదలిర్చెడిధాటిఁ; బాండితీ
గరిమ యొసున్న యంట! పటుకావ్యపుధోరణి పూజ్యమంట! వా
క్స్ఫురణి నిశబ్దసౌష్ఠవరసంబులు మృగ్యములంట! యద్దిరే!
బరబర బజ్జబజ్జ నెడి పద్యములల్లునఁటంచుఁ బల్కన
వ్వారెకవిశేఖరుల్ మఱియుఁ బండితవర్యులునార్యులెల్లరున్?
జరణములెట్లొ నింపినను జాలునఁటంచు దలంచి పద్యమం
"దఱగొఱలేక యొప్పగను నంచితలీలను బొల్పుమీఱఁగాఁ
బరగెడినాతివచ్చెన" నిపల్కినపల్కులు మెచ్చుకొందురే?
సరి! యిటువంటి కైతయతిసత్వర మొప్పఁగఁ జెప్పినంతనే
పరవశులై యితండె సుమిపద్మజదేవ్యపరావతారమం
చరుదుగ వాని నెంతయును నంబరవీథికి నెత్తిపట్టి, యె
వ్వారిమెడలోకడున్ విఱిచి, వారలచేత మృషావధానమే
ర్పఱుపఁగఁ జేసి, యాతనికిఁ బ్రశ్నలనింటనె దిద్దఁ బెట్టి, కొం
దఱికవియిచ్చి, పృచ్ఛకవితానమునందున వారిఁ జేర్చి, యే
ర్పఱచినవానినన్నిటిఁ గబాగబగ్గబపాడఁ జేసి, బా

త్వరమణాభంగులందగునె, వంకలఁ జేరుచుఁబోవుఁగాని ? దు
స్తరకవితాప్రవాహమునుదాఁటఁగలేకయె ఘూర్తకింకవీ
శ్వరుఁడతిసాహసక్రియను శక్తికిమించినప్రశ్నలడ్గ దు
ష్కరమనియూరకుండకయె చయ్యననోటికివచ్చినట్లుచె
ప్పిరసవిహీనవాక్సణితి బెంకుకవిత్వమునల్లి దుష్పదో
త్కరపరిపూరితంబులు వికారపుఁబద్యములెన్ని బాడినన్
గరమువిచిత్రరోదనముగానది తెలునుగాని నిశ్చయం
బెఱుఁగుకవీంద్రసంతతికొకింతయు మోదముఁగూర్చునే ? కవీ
శ్వరులుసహింపరిట్టిదనఁ జాలమనంబునఁగుందనేల ? యె
వ్వరిసుకృతంపుసంచితమువారిదెయంచుఁ దలంపఁజెల్లదే ?
"సరిసరి ! నీకునాఁటిసభసల్పినహైన్యముసైపనౌనె ? మా
సరసనుగూరుచుండుటకుఁజాలవఁటంచును బల్కలేదె ? మా
పరువుచుమీదుపర్వనిలుపందగ డీకొనుమిప్డె"యంచునె
వ్వరొపురికొల్పవారిఁ దనుపందనలావును వైరిలావు నెం
దెఱుఁగక పోరికిన్ దిగుట యెంతయుఁ దప్పిదమౌను గాదె? తా
మఱిమఱికాలుద్రవ్వుటయుమాటలుమాత్రముడాబుచుంటయున్
మఱియొక తప్పుగాదె? మతిమంతులుసైతురె యిట్టిచర్యలన్ ?
స్థిరమతివైరిపండితులతిప్రతిభాయుతులప్రమేయులెం
తొరహిబలాఢ్యసంపదనెదుర్కొననేమియు సాకుఁబెట్టి యు
త్తరములుమానుకొంటిమనితద్దయుసన్నగ రాయబారముల్
జరుపుట; యెందఱోకవులుచాలనెదిర్చి పలార్చిపేర్చిన
త్వరముగమాకుఁజాలుఁడనివ్రాసినమానముఁదాల్చియుంటయున్;
గురుపదసేవఁజేసియనఘుల్ దమకావ్యములందునెంతొచా
తురిమెయివ్రాసిపెట్టినవిదుర్నయమొప్పఁగసంగ్రహించి, యు
బ్బురముగనాశుధారస్వకపోలవినిర్మితమంచుఁ జెప్పి, ట
క్కరిదనమేర్పడన్ జనులకన్నులఁగప్పఁగఁజూచుచుంటయున్
బరిపరి పత్తనంబులను బాడినపాటయె పాఁచిపండ్ల దా

ములయందు వాది ప్రతివాదులయొక్కయు సాక్షులయొక్కయు వచనంబులు మున్నగు నవి వ్రాయులేఖకులను శూద్రులనే నియమించుచుండిరి. ఈవిషయము వంగదేశచరిత్రి గుర్తెఱింగిన వారలకు విశదమగును. వంగదేశమున కాయస్థులను నొక జాతిగలదు. వీరు శూద్రులు, ఈజాతివారలే వంగదేశమున న్యాయసభలయందు లేఖకులుగానుండిరి. అభియోగపత్రింబులు, అదర్య లేఖనము, మొదలగు పనులు కాయస్థులకు వృత్తియే యనియు పలువురాదేశజనులు ఇప్పుడును తలంచుచున్నారు. ఇప్పటికిని ఆదేశమునందు ఈవిషయము మనకు ప్రత్యక్షముగా సులువుగ తెలిసికొనుట కనువుగానుండునని తలంచి వంగదేశమునందలి కాయస్థులను దృష్టాంతముగా తెలిపినాడను. ఇటులనే గ్రామాదాయవ్యయాదికంబును, వారివారి భూముల పరిమాణాదికంబులిఖించు గణకులను సహితము శూద్రులనేర్పరచినటుల దక్షిణదేశమగు నెల్లూరు, చెంగల్పట్టు మొదలగు మండలములయందు మనము సులభముగా నెఱుంగఁగలము, యుద్ధమునకునగు ఆయుధములు మొదలగు సాధనంబుల నిర్మించు ఉసరిలను జాతివారును, కంచుకములు మొదలగువానిని కుట్టెడు సూచికులును, నాట్యమాడునట్టువులును, పలువిధంబులగు రంగుల సంగ్రహించి మనోహరములగు చిత్తరువులు వ్రాయు ముచ్చివారును, విజయస్తంభాదికము నొనర్చు కర్మారులును, మనోహరంబులగు వసనంబుల నిర్మించుకువిందులును, ద్విజాతులకు తమతమ నైపుణ్యములఁగనంబఱచిపరిమితవేతనంబుల నందుచు తమతమ జీవనంబు నిరాటంకముగ సాగించుకొనుచుండిరి. ఆ ద్విజాతుల ప్రోత్సాహము చేతనే వేయివర్షంబులకైనను చెక్కు చెదరకుండునటుల దేవాలయంబులను మేడలను గట్టఁగలిగిన శిల్పులును, నేత్రవిలోభనంబులగు రథంబుల నిర్మించు రథకారులును, జగంబునందంతయు వెలసి పరస్పరము తగిన సత్కారముల నందుచు తమనైపుణ్యముచేత నీ భూలోకంబును సంపదయందును ప్రభావమునందును స్వర్గలోకమునకు సమానంబుగ నొనర్చియుండిరి. ఈవిషయము మానవ్యసోదరు లెఱుంగరా యేమి? తగుప్రోత్సాహమిచ్చి వారి నైపుణ్యమును జగమంతయు వ్యాపింపఁజేసిన ప్రాచీనకాలపుద్విజాతులు శూద్రులనేమి యణగద్రొక్కిరో తెలియునలవిగాకయున్నది. ఈవిధంబున నిష్పక్షపాతముగ వారివారి వృత్తులకుభంగము కలిగింపక తగుప్రోత్సాహమిచ్చి తగినవిధముగ బోధించి, నవీనశిల్పకళల ప్రబంధమూలముగ, వృద్ధిలోనికి తెచ్చిన ప్రాచీనద్విజాతుల ఇటులనిందించుట యెట్టివిధముగఁ దోఁచునో తెలిసికొనవలయును. వారిని దూషించుట క్రిందవ్రాయబోవు విషయమునను మూలమయియుండవచ్చును. ఏదియనఁగా:—మనుష్యజన్మమెత్తిన తరువాత నేదియోయొక ఘనకార్యమొనర్చి పరువుప్రతిష్ఠల నందవలయునని తలంచి తగినకార్యమేమియు చేయశక్తిలేక నిష్కారణముగ బ్రాహ్మణులకును తదితరజాతులకును పోరుపుకలిగించునంతే మాత్ర

ముచేత కృతకృత్యులమును, ఘనకార్య నిర్వాహకులమును అగుదము, అనితలంచి పైవా
దు జగమునందు మానవ్యసోదరులు వేసిరని మేము తలంచుచున్నాము. నిష్పక్షపాత
ముగ విచారించిన “బ్రాహ్మణులు స్వగౌరవమాత్ర మపేక్షించి యితరుల నజ్ఞానాంధకా
రమున బడద్రోచి యణగద్రొక్కిరి” అని మానవ్యసోదరులు పలుకు వచనములు
అప్రమాణములనియు, అసత్యములనియు, నిస్సంశయముగఁ జెప్పవలయును. ఈవిషయ
ము యాథార్థ్యమే చెప్పవలయునని తలఁచు ప్రతిమానవుఁడును అంగీకరించ తగినదిగా
నున్నది. ఉన్న స్థితిగతులును, ప్రాచీన ద్విజాతులొనర్చిన కార్యములును, మాత్సర్యము
విడనాడి విమర్శనాపూర్వకంబుగ విచారించి బ్రాహ్మణవిహితకృత్యముల నాయములయం
దుగల కష్టములకు భయపడి కష్టాధిక్యములేని శూద్రజాతికర్మముల నొనర్పవలయునను
తలంపు దూరముగ నుంచి ఈయభిప్రాయము వారల విచారించినచో వారికె యథార్థము
తెలియును అయిన వారలకట్టితలంపు సాధారణముగ గలుగుటమాత్రము దుర్ఘటమైయు
న్నది. ప్రాచీనపు బ్రాహ్మణులు యితరజాతులకు అపకారము చేసియుండపోవుట
యేగాక శక్తికొలఁది మేలుకలుగఁజేసుకొని వారలకు తగిన క్షేమకృత్యములనే ద్విజా
తులకును నొనర్చిరను విషయముమాత్రము మానవ్యసోదరులు గుర్తెరుంగుదురుగాక.

ఇటుల మేముచెప్పిన యథార్థవిషయములాలకించి మానవ్యసోదరులు బ్రాహ్మణులమీద
మరియొకవిధంబుగ దాడివెడలుచున్నారు:— ఎటులనగా బ్రాహ్మణులు యోగ్యములగు
వంశములను మాత్రము స్వీకరించి వసనసీవనము, చిత్రలేఖనము నర్తనము రథనిర్మాణ
ము, మున్నగు నీచపు పనులనుమాత్రము శూద్రులకంటుగట్టి వారలకు వానినిబోధించిరి,
వారలు నిష్పక్షపాతమగు నభిప్రాయముగలవారలయిరేని ఆపనులనే బ్రాహ్మణులకు
నంటుగట్టి శూద్రులకు వేదాధ్యయనము చెప్పియుండరా, అటులచేయక బ్రాహ్మణులకు
మాత్రము వేదాధ్యయనము చెప్పితక్కినవారలకు చిత్రలేఖనాది విషయముల బోధించుట
యే బ్రాహ్మణులు స్వగౌరవమాత్రమును గాపాడికొనిరనుటకు ప్రధానప్రమాణముఅని
మానవ్యసోదరులు మారలుమారలు చూచి పలుకుచున్నారు. ఇందులకుబదులుదూ
రమాలోచించి యథార్థమైన విషయంబునే చెప్పదలచియున్నాము. మీరు చెప్పిన
యంశములో “బ్రాహ్మణులు వేదాధ్యయనాదికమగు గౌరవకృత్యమును మాత్రము తాము
గ్రహించి నీచకృత్యములగు చిత్రలేఖనాదికమును శూద్రాదుల కొప్పగించిరి” అనురెం
డువిషయములయియున్నవి. పైపూర్వపక్షమును వేసిన మానవ్యసోదరులు పలుకుజాడ
లుచూడ వారలకు వేదంబులయందును, ధర్మశాస్త్రంబులయందును సరియగు విశ్వాస
ము గలిగియే యీపూర్వపక్షమును చూపిరనిమాకు తోచుచున్నది. ఇట్టిపూర్వపక్షముల
కు నుత్తరమిచ్చుటయు సనాతనధర్మీయుల కొకవిధమగు నిత్యకర్మయయి యున్నది.

# ❋ మానవసేవ ❋

మత, సంఘ, పత్రికా, భాషావిషయములఁ బ్రచురించు సచిత్రమాసపత్రిక.

మ. "గరిమన్ స్వర్ణ మనేకభూషణములన్ గన్పట్టు చందంబునన్
బరమాత్మం డఖిలప్రపంచమయుఁడై భాసిల్లుఁ గానన్, జరా
చరరూపోజ్జ్వల సర్వభూతములకున్ సంప్రీతిఁ గల్గించుచున్
నిరతిన్ మానవసేవ సర్వజనముల్ నిత్యంబు సేయందగున్"

భూమండలమున మనభారతఖండము తక్క తక్కిన దేశములెల్ల నిక్కాలమున నాగరికాగ్రగణ్యములై సమస్త సంపదలతోను సంతత సౌఖ్యములతోను నిత్యకల్యాణములతోను దుల దూగుచు భూలోకస్వర్గములవలె భాసిల్లుచున్నవి నిన్న మొన్నటివఱకుఁ గన్నులు తెఱవక యనాగరికులైయున్న విదేశీయులెల్ల సృష్ట్యాదినుండియుఁ గాణాచిగా ననుభవించుచున్న గాఢనిద్రనుండి మేల్కాంచి కాలప్రభావమున నింద్రజాలమునంబలె నొక్కపెట్టున మహోన్నతదశ నందుచున్నారు

అనేకశతాబ్దములకుఁ బూర్వమే, మహామేధావంతులు శమదమాలంకృతులుఁ ద్రికాలజ్ఞులుఁ దపస్స్వాధ్యాయనిరతులు నగు మహర్షులచేతను, సత్యసంపన్నులుఁ బ్రజానురంజకులు ధర్మస్వరూపులు దేజోవిరాజితులు నగు చక్రవర్తులచేతను, సకలభాషాభూషణులు సాహిత్యరసపోషణులు విజ్ఞానవిదులు నగు మహాకవులచేతను, నీతిమంతులు దేశభక్తులుఁ బరోపకారపారీణులు నగు ప్రజలచేతను, మానవతులు జ్ఞానవతులుఁ బతివ్రతలు నగు విదుషీమణులచేతను, ప్రకాశించుచు జగజ్జేగీయమానమై సకలలోకగురుపీఠము నధిష్ఠించిన మనభారతవర్షము నేఁడు కళావిహీనమై యంధకారబంధురమై యధఃపతిత మగుచున్నది

‘ఏకమేవాద్వితీయంబ్రహ్మ" యని బోధించిన మన మిప్పుడు బహుదేవతారాధనముఁ జేయుచున్నారము "బ్రహ్మకృపాహికేవలం" మ్మని యుపదేశించిన మనము విగ్రహములనుపాసించుచున్నారము ‘ఆత్మవత్సర్వభూతాని’ యని చెప్పిన మనము శాఖాభేదములకై పెనఁగులాడుచున్నాము. ‘అహింసాపరమో ధర్మః" యని వక్కాణించిన మనము పరహింసయే జీవనముగాఁ జేసికొనుచున్నారము "నమాతుః పరదైవత" మ్మని శాసించిన మనము మాతృపూజను మఱచినారము. "విద్యావిహీనః పశుః" అని తెలిపిన మనము విద్యలను విడనాడినారము

అశేషశేముషీధురంధరు లగు దేశబంధు లహోరాత్రములు శ్రమపడి సముపార్జించిన జ్యోతిశ్శాస్త్రము గగనకుసుమ మైనది. లీలాగణితము లీలామాత్ర మైనది చరక, సుశ్రుతాదివైద్యశాస్త్రములు మందునకైనఁ గానరాకున్నయవి దివ్యవిమానములు దివ్యులఁ జేరినవి. వాల్మీకాది గీర్వాణకవిపుంగవులు వల్మీకములపాలైరి పెద్దనవంటి కవులు పెద్దలఁ గలసిరి. కృష్ణరాయలవంటి చక్రవర్తులు కృష్ణదేవుం జేరఁ బోయిరి భారతసామ్రాజ్యము పూజ్య మైనది మతాధికారులు మతాధికారు లయిరి చీనిచీనాంబరము లంబరము నంటిపోయినవి. ఢక్కామజిలీనులు మజిలీలు చేయంబోయి విదేశసీమల విహరించుచున్నవి శిల్పములు స్వల్పము లయినవి. మయసభాస్థాపిత విచిత్రదర్పణము లజ్ఞానదేవతాసమర్పణము లైనవి విద్యుజ్జ్యోతులు విద్యుల్లతలం గలిసినవి చేతిపనులు చేజారినవి.

అజ్ఞానవ్యాధిగ్రస్తమై, విద్యాధనాదిరక్తమాంసవిహీనమై, నాగరికతాకళాశూన్యమై ప్రాణమాత్రావశిష్టమై యున్న మనదేశదేహమును సమయసముచితోపాయ సిద్ధౌషధసేవనంబున నారోగ్యభాగ్యయుక్తముఁ జేయక కతిపయకాలము పేక్షించితి మేని నపాయము సంభవించును మనయార్యసమ్మతమును సముద్ధరింపవలయును మన యాచారముల సంస్కరించుకొనవలయును ప్రకృతిశాస్త్రముల బలపరచుకొనవలయును సారస్వతము నుజ్జీవింపఁ జేయవలయును. ధనసంపాదనమును జ్ఞానోపార్జనమును జేయవలయును. మానవధర్మము లనుష్ఠింపవలయును. సన్మార్గదర్శకులను కావలయును

ఈవిధమున మానవసేవ సేయుట కనియే యీ 'మానవసేవ' నెలకొలిపినారము మానవసేవయే దేశసేవయు, దేశసేవయే యీశ్వరసేవయుఁ గావున దీనిం జేపట్టి మీపట్టివలెఁ బోషించుభారము మీపయిం బెట్టినారము.

64 పుటలను గలిగి చక్కని ప్రతిమలతో విలసిల్లు నీమాసపత్రిక సర్వజనసులభముగా నుండునట్లు సంవత్సరమునకు రు 3 లు మాత్రమే చందా నేర్పరచినారము అభిమానులకు రు 5 లు, పోషకులకు రు 10 లు, రాజపోషకుల యాదరణము వారియనుగ్రహాధీనము

పత్రిక 1911 వ సంవత్సరము జనవరినుండి వెలువడుచున్నది.

మానవసేవా కార్యస్థానము
రాజమహేంద్రవరము
13-4-1911.

నాళము కృష్ణారావు
కందుల శ్రీమన్నారాయణ.
పత్రికాసంపాదకులు

# ఈ నెలసొమ్ము చెల్లించినచందాదార్లు.

1 శేషభట్టరు శ్రీనివాసాచార్యులుగారు. వైకుంఠపురం

2 కూనెపగుంట్ల హనుమంతరావుగారు. ప్లీడరు నర్సారావుపేట

3 ఆలూరుగోపాలరావుగారు. —— డిటో

4 కంచర్లహనుమయ్యగారు. లైసెన్సుగుమస్తా మాచవరం

5 వాకాలనాగభూషణంగారు. పన్నిగండ్ల

6 భాగవతుల గోపాలకృష్ణయ్యగారు. కృష్ణాయిర్రిగేషన్ సబ్ డివిజనా ఫీసుక్లర్కు బెజవాడ

7 కోచికంటిహనుమయ్యగారు. లైసెన్సుగుమస్తా వేల్పూరు

8 పూటుకూరికోటయ్యగారు. చీరాల

9 రాజా వాసిరెడ్డి చంద్రమౌళీశ్వరప్రసాదు బహద్దూరుజమీన్ దారువారు ముక్త్యాల.

10 నూతక్కినరసింహారాయుడుగారు గ్రామమునసబ్ మందడం.

11 పూటుకూరి వెంకటేశ్వర్లుగారు చేర్మెను చీరాల

12 పుల్చిరామయ్యగారు. పేరికలపూడి.

13 పింగళిసూర్యనారాయణగారు. కరణం కంఠంరాజుకొండూరు

14 రాజానాయని వెంకటరంగారావు. బహద్దూరు జమీన్ దారు వారుమునగాల.

15 దినవహిసూర్యనారాయణగారు. ముక్త్యాల.

16 ములుకుట్లవీరరాఘవశాస్త్రిగారు. యింకొల్లు.

17 పర్చూరు రామానుజరావుగారు. పెనగంచిప్రోలు

18 పోతకమూరు వెన్నయ్యగారు. కంట్రాక్టరురావిపాడు.

19 శిష్టాసోమశేఖరశాస్త్రిగారు. గ్రామమునసబ్ మంచాళ్ల

20 మల్లాదిపున్నయ్యగారు. రివిన్యూ యిన్స్పెక్టరు నర్సారావుపేట

21 బంతపూడిహనుమంతరావుగారు. కంట్రాక్టరునర్సారావుపేట

ప్రధానపోషకులు

శ్రీశ్రీజగద్గురు విరూపాక్షస్వాములవారు

ఈసంవత్సరము చందాయిచ్చిన

పోషకులు

1 తాడేపల్లి లక్ష్మీనరసింహారావుగారు, మక్తాదార్, చోల్లేరు

2 రంగావఝ్ఝుల హనుమయ్యగారు, జిల్లాకోర్టువకీలు, గుంటూరు

3 ప్రత్తిపాటి బ్రాహ్మణులు, వైశ్యులు.

ఇవ్వవలసినవారు

5 తిప్పరాజు కామేశ్వరరావుగారు, కరణం, దుగ్గిరాల.

అభినవసరస్వతి కార్యస్థానమున వెలకుదొరకు పుస్తకములు.

| | | |
|---|---|---|
| 1 | అర్లయాచార్యవిజయము | 0—4—0 |
| 2. | కరిణీకోద్ధారిణి (పూరెవీరభద్రకవి) | 0—4—0 |
| 3 | వాసంతికాపరిణయము } ఇవి 2 నాటకములు | 0—4—0 |
| 4. | కంసవధము } ఇవి 2 నాటకములు | 0—5—0 |
| 5. | చమత్కారమంజరి (సింహాద్రి వెంకటాచార్యులు) | 0—4—6 |
| 6 | గురుపరంపర | 0—2—0 |
| 7. | నీతిగీతులు (సుమతిశతకమునకు సంస్కృతము) | 0—2—0 |
| 8 | వత్సలనీతిశతకము (కొండముది నరసింహము) | 0—1—6 |
| 9 | విశ్వబ్రాహ్మణశబ్దఖండనము | 0—1—6 |
| 10 | అత్యద్భుతవిమర్శనము (మం॥ కృష్ణద్వైపాయనాచార్యులు) ఇది వెంకటరామకృష్ణకవుల యవధానములకు విమర్శనము | 0—5—0 |
| 11 | నర్సారావుపేట శతావధానము (తిరుపతి వెంకటేశ్వర్లు) | 0—3—0 |

వలయువారలు సొమ్ముపంపిగాని వి.పి. ద్వారాగాని ఈ క్రిందివారికి వ్రాసి తెప్పించుకొనవచ్చును.

 ఎడిటర్, అభినవసరస్వతి,

జానపాడు, పిడుగురాళ్ళపోస్టు,

గుంటూరుజిల్లా.

